# కళ

డిశంబరు : 1936

సంపాదకుడు : పాటిబండ మాధవ శర్మ ఎం. ఏ. (ఆనర్సు)

ప్రధాన విషయాలు



♦ ♦ ♦ ♦ ♦ ♦

కళ కార్యాలయము, తెలప్రోలు, కృష్ణా.

# విషయసూచిక







సంపుటి ౧ * శా.శ ౧౮౫౮ ధాత, కార్తికము * సంచిక ౬

## వీ ణ వి ష యం

*

వీణ ఆరో సంచిక. ఈ సంచికతో వీణ మొదటి సంపుటం పూర్తి. రాబోయే సంచికనుంచి కొంత మార్పు పొందబోతుందని లోగడ మనవి చేశాము. చదువరులకు ఎక్కువవిషయాలు అందజెయ్యాలని సంకల్పం కలిగింది. దానితో పాటు చందా ఎక్కువ చెయ్యాలనీ. అయితే చాలామంది మిత్రులు పాఠకులు ఈ ఆర్థిక దుస్థితిలో చందా ఎక్కువ చేయుటకు అంగీకరించక ఇప్పుడు ప్రకటించే ౧౬ పుటలలోనే విజ్ఞానప్రదములగు వ్యాసాలను ప్రకటించి అందజేయ గోరినందున పత్రికను ఆవిధముగానే నడుపుటకు నిశ్చయించినాము. ఇప్పటినుంచి ఇదే వీణకు నిశ్చితరూపం.

# ఓ ధార్వ.

నిరంకుశాధికార నిబిడ నిశీథినిలో
నీ గర్భవేదన కడలి బడబాగ్నిని మించిపోనీ—
నీ హృదయ మాశా శూన్యమై కుంగిపోనీ—
పంచ ప్రాణాలలో
ఒక్కటొక్కటీ
పటా పంచలై పోనీ—
మాట్లాడకు.

చేరబోయిన వారంతా చేసిన
సీత్కార ఫూత్కారములతో
స్వాభిమాన స్వర్ణ కాంతులలో
ధగధగ మెరిసే నీ శరీరము
తూట్లు పడిపోనీ
మాట్లాడకు.

నీ జీవిత నౌకా శిథిలావస్థలో
నీ అండ నున్న అప్పుల ముఖ ప్రసూనములు
వాసనలు వీడి వాడి రాలిపోతుండగా
గుడ్లు మిటకరించు కొంటూ
నిలువున నీరై పో—కాని
మాట్లాడకు.

ఎంతలేసి దురంతాలైనా- నిశ్శబ్దంగా-
నిన్ను పీల్చివేసే పిశాచును పైకి పొక్కనీకుండా
ఆహార నిద్రాదులు విడనాడి
అహోరాత్రాలు - అనుభవించు
కాని— మాట్లాడకు.
వాటికి కారణ మడిగితే ఒక గొప్ప నేరమౌతుంది.

కొమరవోలు నాగభూషణరావు

# ఆంధ్ర భారత రచనోద్దేశ్యము

గొడవర్తి సూర్యనారాయణరావు యం. ఏ. (ఆనర్సు)

(గత సంచిక తరువాయి)

ఆంధ్ర మహాభారతము అప్పుడేల సృష్టికి వచ్చెను? తత్పూర్వ మేల రాకుండెను? అనునది విచారించ వలయును. ఈ సృష్టికి కారణభూతములు త్రివిధములుగా నున్నవి. ఒకటి కాలమహిమ. రెండవది కావ్యగీతి ప్రియుడగు రాజరాజు. మూడవది ఉభయకావ్య రచనాభిశోభితుడగు నన్నయభట్టు. ఈ పదనొకండవ శతాబ్దము యొక్క మహత్త్వమేమో కాని ఒక్క ఆంధ్రదేశముననే గాక హిందూదేశమందలి యితర రాష్ట్రములందే గాక ఖండాంతరము లందును సరస్వతి అవిచ్ఛిన్నముగా మహా వైభవముగా కొలువుతీర్చిన శతాబ్దమిది. పదునారవ శతాబ్దము గూడ యిట్టి స్వర్ణయుగమనియే చెప్పవలయును. ఇది కాలమహిమ తప్ప వేరొకటికాదు. ఇట్టి మంగళప్రదమైన సుముహూర్తమున దేశ కవితాకన్య యుద్భవించినది. ఇంత వఱకును సంస్కృత వాఙ్మయ మకరందము నాని ప్రమత్తులైన పండితులు ఆ మాధుర్యమును తమ మాతృభాషలోగూడ దేశీయులకు చవిచూప నిచ్ఛగించిరి. ఇదియు దేశకవిత వెలువడుటకు హేతువు. పదునొకండవ శతాబ్దమున సంస్కృత నాటకములు కృష్ణపక్ష చంద్రునివలె క్షీణించుచుండ దేశభాష లభివృద్ధి గాంచుట మొదలిడెను అని కీత్ పండితుడు చెప్పియున్నాడు. ఈ శతాబ్దముననే ఆంగ్లవాఙ్మయమున కాదిపురుషుడగు ఛాసరు (Chaucer) పండితుడు కేంటర్ బరీ టేల్సు అను గ్రంథమును వ్రాసియున్నాడు. ఈ కాలముననే హిందూదేశమును పదునేనిమిది మారులు కొల్లగొట్టి విజయారంభలవరించి గాంగ జలమున నెత్తుటికత్తి గడిగిన గజని వాఙ్మయ పుణ్యభూమిలో కృతి స్వీకరణ సదనము నిర్మించుకొనెను. ఇక హిందూదేశమున ధారానగరము రాజధానిగ మాళవ దేశమును పరిపాలించినవాడు భోజ

మహా రాజు. విద్యాపోషణకును వదాన్యతకును పేరుపొందిన యీ చక్రవర్తి యాస్థానము నలంకరించిన కవిరత్నములు మనకు శ్రుతపూర్వులు. గుజరాతునందును, బంగాళమునందును, కర్ణాటకమునందును, మహారాష్ట్రము నందును గ్రంథములు వెలువడి యుండెను. ఒక్క తెనుగున తప్ప తదితర భాషాగౌరవమునకు వన్నెకెక్కిన మండలములలో గ్రంథములు బయల్వడెను. కాలప్రవాహము నరికట్ట మానవునకు సాధ్యమా? ఈ యాంధ్ర భారతము రాజరాజు సామ్రాజ్యము సర్వదా సంపన్నమును నిరుపద్రవమును నై సమృద్ధితో పెంపొందియున్న దినములలో వెలువడి యుండెననుట సత్యేతరముకాదు. ఇట్టి పరిస్థితులలోనే కదా కళలే దేశమందైన యభివృద్ధిచెందుట. గ్రంథములు వెలువడుటకొక్క కాలపరిభావమే చాలదు. కవియు, కవితా పోషకవర్గమును, ముఖ్యములు. ఇప్పుడు ఆంధ్రమహాభారత కృతిభర్తయగు రాజరాజునుగూర్చి ముచ్చటింపవలెను. ఈ మహామహుడు సామ్రాజ్యమును, కవితారాజ్యమునుగూడ సమానదృష్టితో పాలించెను. భారతావతారిక ననుసరించి రాజరాజును గురించి మనకు తెలియు విషయము లివ్వి. ఈతని యాస్థానము వ్యాకరణ మహామహోపాధ్యాయులకును, పౌరాణిక విశారదులకును, కవిబ్రహ్మలకును, తర్కవాచస్పతులకును ఆటపట్టు. వీరందరును సంస్కృత, దేశభాషల సహాయమున ఆంధ్రపదజాలమును పుష్టిగల దానినిగా జేయుచుండిరి. సాహితీసభలలో వీరుచేయు కార్యమిది. ఇది ద్రవిడ సంప్రదాయము. రాజరాజు తన మాతామహులనుండి యీ యమూల్యమైన రత్నమును తెచ్చెను. తమిళ వాఙ్మయమున నిట్టి సుశబ్దాపశబ్ద నిర్ణయసంఘము లుండుట విదితము. రాజరాజు పండితులవలన అనేక పురాణములు విమలమైన మనస్సుతో వినియున్నాడు. తానై యుదాత్త రసాన్విత కావ్య నాటక క్రమములు పెక్కు చదివియున్నాడు. కన్నడమున తమిళమున కూడ భారతము వెలువడినది. బహుభాషల, బహువిధముల వినియున్నాడు. కాని

తనివి తీరలేదు. ఇంకను చిత్తమెల్లపుడు 'భారత కథా శ్రవణ ప్రవణము' అనవరతమ్మును శ్రీ మహాభారతంబు నందలి యభిప్రాయంబు విన నభిలాష పెద్దదై యుండును. 'పంప' భారతమును కన్నడభాష యందు వినియున్నాడు. కాని అది మమతా దూషితమును, పాక్షికమునని గ్రహించెను. అందుచేతనే తెనుఁగున సమగ్రముగా వినగోరి

జననుత కృష్ణద్వైపా
యనముని వృషభాభిహిత మహాభారత బ
ద్ధ నిరూపితార్థ మేర్పడఁ
దెనుఁగున రచియింపు మధిక ధీయుక్తి మెయిన్.

ఇదిగాక రాజరాజు భారత శ్రవణాసక్తమతి,

ఇవి యేనుక్ సతతంబు నాయెడ గరం బిష్టంబులైయుండు బా
యవు భూదేవకులాభితర్పణ మహీయః ప్రీతియున్ భారత
శ్రవణాసక్తియుఁ బార్వతీపతి పదాబ్జధ్యానపూజా మహో
త్సవమున్ సంతతదాన శీలతయు శశ్వత్సాధు సాంగత్యమున్.

ఇదిగాక మఱియొక కోరిక కలదు.

హిమకరు దొట్టిపూరు భరతేశ కురుప్రభు పాండు భూపతుల్
క్రమమున వంశకర్తలనగా మహినొప్పిన యస్మదీయ వం
శమునఁ బ్రసిద్ధులై విమలసద్గుణశోభితులైన పాండవో
త్తముల చరిత్రనాకు సతతంబు వినంగన భీష్టమెంతయున్.

సాధారణులకువారే తమపూర్వుల చరిత్రమును పొగడు కొనుచు వంశవృక్షముల నతిభద్రముగా భాండాగారములలో భద్రపరచుచుండ రాజరాజునకు తనప్రసిద్ధ వంశకర్తల చరిత్రమును విన నభిలషించుటలో విశేషమేమున్నది? తాను తెనుగురాజు. తెనుగుదేశము గొప్ప వోక పండితులతో నిండియున్నది. తానో కావ్యగీతిప్రియుడు. కావున తెనుగుభాషలో భారతమును నిష్పాక్షికముగా వ్రాయించెను. ఇక దొరకినకృతికర్త నన్నయభట్టు. ఇతడు విపులశబ్దశాసనుడు, సంస్కృత

సంహితాభ్యాసుడు, బ్రహ్మాండాది నానాపురాణ విజ్ఞాన నిరతుడు, లోకజ్ఞుడు, ఉభయ భాషాకావ్య రచనాభి శోభితుడు, నిత్యసత్య వచనుడు అవిరళ జప హోమ తత్పరుడు, విద్యాదయితుడగు రాజరాజు నన్నయను భారతము రచింపుమని కర్పూరతాంబూల మిచ్చెను. సాహితీసభలు బహుళ ప్రచారములోనుండి కావ్యమున కావశ్యకమైన శబ్దసామగ్రిని బరిపుష్టి చేయుచుండెను. ఇక తనకు నిరంతరము కావ్య రచనకు తోడ్పడుట కిరువైపుల నారాయణభట్టు, భీమనభట్టు కలరు. వీరు సామాన్యులు కారు. నారాయణభట్టు సంస్కృత, కర్ణాట, పైశాచి కాంధ్ర భాషలయందు కవిరాజశేఖరుడే గాక కవిభ వజ్రాంకుశుడు. వీరి సహాయమును, సాహితీ సభలును, రాజపోషణయు, తన మహత్త్వ కవిత్వ పటుత్వ సంపదయు నన్నయభట్టును భారత రచన కున్ముఖుని గావించినవి. అర్జునునకు గాండీవముదక్క తదితరములగు విండ్లు నచ్చనట్లు నన్నయభట్టునకు భారతముతప్ప తదితర గ్రంథములు నచ్చలేదు. నన్నయ భద్రకుంజర విహారమునకు కురుక్షేత్రము గాని నచ్చలేదు.

తదితర గ్రంధములు గాక భారతమే వ్రాయుటకు కారణమును గూర్చి విచారించ వలయును. తదితర గ్రంధము లన్నియు నొక్కొక్క ధర్మమునే ప్రతిపాదించు చుండును. స్కాందము, మొదలగునవి ప్రత్యేకదేవతలకు ప్రాధాన్యము నిచ్చునవి. కాని భారతము సర్వ ధర్మములను సమన్వయించి యున్నది. ఇదిగాక

ధర్మ తత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని
యధ్యాత్మవిదులు వేదాంతమనియు
నీతి విచక్షణుల్ నీతిశాస్త్రంబని
కవివృషభులు మహాకావ్యమనియు
లాక్షణికులు సర్వలక్ష్య సంగ్రహమని
యైతిహాసికు లితిహాస మనియు

బరమ పౌరాణికుల్ బహుపురాణ సముచ్చ
యంబని మహిఁగొని యాడుచుండ
విరథ వేదతత్త్వవేది వేదవ్యాసుఁ
డాదిముని పరాశరాత్మజుండు
విష్ణుసన్నిభుండు విశ్వజనీనమై
పరగుచుండఁ జేసె భారతంబు.

కావున ఆంధ్రమునకు మహాభారతము వెలువడుట మత ప్రచారము కొఱకు కాదనియు వాఙ్మయసేవకే అనియు తెలియుచున్నది. రాజ రాజ నరేంద్రుడు కావ్యదృష్టితో దేశభాషయందు నిర్దుష్టమగు కావ్యమును రచింపించుటకై భారత రచనకు నన్నయను పురికొల్పెనని తలంచుట సమంజసము.

అనుటచే సత్యసంకల్పులైన చాళుక్యుల యాశయములు రాజరాజు కాలమున జగన్మోహనముగ ఫలించినవి. ఈ భారత రచనవలన బ్రాహ్మణమతము విజృంభించినచో మఱియు మేలయ్యె: కాని ఉద్దేశ్యము బ్రాహ్మణమతోద్ధరణము మాత్రము కాదు. భాషాసేవయే.

---

భారతం మతప్రచారార్థంగాక కేవలము సారస్వతపోషణార్థమే పుట్టినదని వాదించే ద్వితీయపక్షానికి శ్రీ పింగళి లక్ష్మీకాంత కవిగారు చెందినట్లు ఈ వ్యాసకర్త ఉద్దేశంగా కనబడుతోంది. యథార్థం విచారిస్తే శ్రీలక్ష్మీకాంతకవిగారు ఇదమిద్ధమని ఏపక్షమునకును చెందినవారుకారు. ఈ ఉభయపక్షములను సమన్వయించే దృష్టిగలవారు శ్రీకవిగారు. "ద్వితీయ పక్షావలంబులను" అను వ్యాసకర్త మాటలకు చదువరులీ యర్థమునే స్వీకరించవలసి వుంటుంది.

సం॥ వీ.

# మాస్కో శిక్షితులు

నండూరి ప్రసాదరావు

ఇటీవల మాస్కోలోజరిగిన కమ్యూనిష్టు విద్రోహుల శిక్షలగూర్చి దేశములో అపోహాలు ప్రబలినాయి కాబట్టి ఆశిక్షితులగూర్చి, వారి సిద్ధాంతాలగూర్చి వ్రాయటం అనవసరం కాదనుకుంటాను. ముఖ్యులగు ట్రాట్స్కీ, జినోవివ్ టామ్స్కీలగూర్చి మాత్రమే వ్రాస్తాను. ట్రాట్స్కీ:- ఈతడు 1879లోపుట్టి నికోలెవ్ లో సోషల్- డెమోక్రటిక్ పార్టీలో జేరాడు. రష్యాలో అప్పటి కదొక్కటే మార్క్సిస్టు పార్టీ. దక్షిణరష్యను కార్మిక సంఘంలో పలుకుబడి సంపాదించి, 1898లో అరెస్టుకాబడి సైబీరియాకు ప్రవాసమంప బడినాడు. కాని 1902లో తప్పించుకొని విదేశాలకు పారిపోయాడు. 1903లోరష్యను సోషల్-డెమోక్రాటికు పార్టీ సమావేశంలో పాల్గొని అప్పుడేర్పడిన చీలికలలో మెన్షివిక్కు (Menshivik)పార్టీలోజేరి ఇస్క్రా(Iskra) పత్రికను నడుపుటకు కృషిసల్పాడు. 1905లో విప్లవంలో పీటర్సుబర్గునుండి పాల్గొన్నాడు. అప్పుడు ఆతని ప్రఖ్యాతిగాంచిన శాశ్వతవిప్లవం (Permanent revolution) అనుసిద్ధాంతమును పార్వసు సిద్ధాంతములపై ఏర్పర్చినాడు. పీటర్సుబర్గు సోవియటు ప్రెసిడెంటుగా 1905లోతిరిగిఅరెస్టు జేయబడి సైబీరియాకు ప్రవాసమంపబడినాడు కాని దోవలోనే తప్పించుకొని వియన్నా జేరుకున్నాడు. అచ్చట నుండి ప్రావ్డా (Pravda) పత్రికను సోషల్-డెమోక్రాటుల సాయముతో నడుపుట మొదలిడినాడు. 1912లో బోల్షివిజము నెదుర్కొనుట కేర్పడి "ఆగస్టుబ్లాకు" (August Block) లోజేరినాడు. 1914 1918సామ్రాజ్యవాద యుద్ధంలో, పారిసు లోని అంతర్జాతీయ పత్రిక యగు నోషి స్లోవో (Noshe-slovo) యొక్కసంపాదకులలో ఒకడు. జిమ్మరువాల్డు (Zimmerwald) కాన్ఫరెన్సులో పాల్గొనిమధ్యస్త పక్షమువహించాడు. 1916లో ఫ్రాంసునుండి తర్వాత స్పైనునుండి

వెళ్ళగొట్టబడి చివరకు U.S.A. చేరుకున్నాడు. మార్చి విప్లవం తర్వాత రష్యాకు చేరి ఇంటర్ బరోమ్ఘైట్స్ (Interboromghites)అనే అంతర్జాతీయ పక్షంలో చేరి, దానితోపాటు బోల్షివిక్కు పార్టీలో చేరి, దాని సెంట్రలు కమిటీకెన్నుకో బడ్డాడు. 1917లో బోల్షివిక్కులు పెట్రోగ్రాడు సోవియటులో మెజారిటీ సంపాదించగానే దాని అధ్యక్షుడైనాడు. నవంబరు విప్లవం తర్వాత లెనిన్ ప్రభుత్వంలో విదేశాంగమంత్రి "యుద్ధముగాని సంధిగాని వద్దు" అనీ (no war, no peace) తర్వాత "విప్లవ యుద్ధం" కావాలనీ అంటూ బ్రెస్టులిటోవస్కీ (Brest-Litovsky) సంధిని ఎదుర్కొన్నాడు. 1918–24వరకు యుద్ధమంత్రి రిపబ్లికు యొక్క విప్లవ యుద్ధసంఘముయొక్క అధ్యక్షుడు. ఈ దినములలో కమ్యూనిస్టుపార్టీలోను, కమ్యూనిస్టుఇంటర్నేషనలులోను ప్రధానస్థానమాక్రమించాడు. లేబరుయూనియన్ల విషయంలో పార్టీలో ఒక చీలికకు నాయకుడైనాడు. 1923లో పార్టీలో "ప్రతికూలపక్షమును లేవదీసి 1926లో జినోవివ్ కమనిక్‌లతో కలసి "ఐక్య ప్రతికూల పక్ష" నాయకుడైనాడు. ఈ రెండవదానిని సోషలు–డెమోక్రాటు, అభివృద్ధి నిరోధక ప్రచారాలు కలిగిన దానినిగా కమ్యూనిస్టు ఇంటర్నేషనలు నిర్ణయించింది. 1927లో పార్టీలోను, ప్రభుత్వంలోను అన్ని స్థానములనుండి తొలగింపబడి తర్వాత దేశమునుండి బహిష్కరింప బడ్డాడు.

జినోవివ్:– (Zinoviev) జననం 1883. 1901లో సోషల్–డెమోక్రటిక్ పార్టీలో చేరాడు. 1903 చీలికలలో బోల్షివిక్కు పార్టీలో చేరాడు. 1905 వరకు స్విడ్జరులెండులో చదువుకున్నాడు. 1905 విప్లవంలో పీటర్సుబర్గులో నుండి దాని సెంట్రల్ కమిటీ కెన్నుకోబడ్డాడు. అరెస్టుచేయబడి విదేశాలకు వలస బాపబడ్డాడు. లండనులో జరిగిన పార్టీ సమావేశమునకు హాజరైనాడు. 1908లో తిరిగి రష్యా ప్రవేశించి పనిజేయ ప్రయత్నించాడు. కాని తిరిగి అరెస్టు చేయబడుటచే దేశమును వదలవలసి వచ్చింది. విదేశాలలో ఉంటూ పార్టీపత్రిక

యగు "సోషల్-డెమొక్రాటు" సంపాదకీయంలో చేరాడు. జిమ్మర్వాల్డు (Ziemmrwald) కీంథాలు (Kiemthal) కాన్ఫరెన్సులలో పాల్గొన్నాడు. మార్చి విప్లవం తర్వాత లెనిన్‌తో కలసి రష్యా చేరుకున్నాడు. నవంబరు విప్లవం తర్వాత పెట్రోగ్రాడు సోవియటు అధ్యక్షుడుగా ఎన్నుకోబడ్డాడు. 1919-26 వరకు కమ్యూనిస్టు ఇంటర్నేషనలు యొక్క సెంట్రలుకమిటీ అధ్యక్షుడు. నవంబరు విప్లవసన్నాహంలోను, తర్వాతను ఆతడు అనేకసార్లు చంచలతను కన్పర్చాడు. 1917లో విప్లవానికి ప్రతికూలత జూపాడు. నవంబరు విప్లవంతర్వాత సోషలిస్టు ఐక్యప్రభుత్వము కోరాడు. 1923-24లందు ట్రాట్స్కీ ప్రతికూల పక్షాన్ని తీవ్రంగా ప్రతిఘటించాడు. కాని 1925 లో నూత్న ప్రతికూలపక్ష నాయకత్వం వహించి 1926లో ట్రాట్స్కీ ముఠాతో చేరి ఐక్య ప్రతికూలపక్ష నాయకులలో ఒకడైనాడు. దానికి 1927 ఆఖరులో పార్టీనుండి వెడలగొట్టబడినాడు. తర్వాత తన తప్పిదముల నొప్పుకొనుటచే పార్టీలో చేర్చుకోబడ్డాడు. తిరిగి 1931లో పార్టీనుండి వెడలగొట్టబడి ఖైదుచేయబడ్డాడు. ఇతడు కమ్యూనిస్టు ఇంటర్నేషనలు యొక్క ప్రథమాధ్యక్షుడు.

కమనీవు:- (Kamaniev) జననం 1883. 1901లో సోషల్-డెమొక్రటిక్ పార్టీలో చేరి, 1903లో బోల్షివిక్కు పార్టీలో చేరాడు. మాస్కో, టిఫ్లిసు, (Tiflis) పెట్రోగ్రాడులలో పనిజేసాడు. 3 5 పార్టీ కాంగ్రెసులలో పాల్గొన్నాడు. 1903 తర్వాత విదేశాల్లో పార్టీ పత్రికా నిర్వహణమున పాల్గొన్నాడు. 1914తొలి రష్యనుడ్యూమాలోని సోషల్-డెమొక్రటిక్ పక్షాన్ని, ప్రావ్దా (Pravda) సంపాదకీయమును నడిపింప సెంట్రల్ కమిటీచే పంపబడ్డాడు. అరెస్టు చేయబడి 5 బోల్షివిక్కు డ్యూమా ప్రతినిధులవెంట సైబీరియాకు ప్రవాసమంప బడ్డాడు. 1917మార్చి విప్లవంలో విముక్తుడైనాడు. ఏప్రిల్‌లోని బోల్షివిక్కు కాన్ఫరెన్సులో పాల్గొని లెనిన్ సిద్ధాంతములను ప్రతిఘటించాడు. తర్వాత సెంట్రలు కమిటీ కెన్నుకోబడ్డాడు. జూలై సంఘటనముల

తర్వాత కెరన్‌స్కీ (Kerensky) ప్రభుత్వంచే అరెస్టు చేయబడ్డాడు. 1917 ఆఖరున విప్లవాన్ని ప్రతిఘటించాడు. లెనిన్‌ను ప్రతిఘటిస్తూ విప్లవంయొక్క "డెమోక్రటిక్" పరిణామమనే సిద్ధాంతాన్ని ప్రతిపాదించాడు. నవంబరు విప్లవజయం తరువాత ఐక్య సోషలిస్టు ప్రభుత్వాన్ని (బోల్షివిక్కులతో కలసి) కోరాడు. అధికసంఖ్యాకులతో అంగీకరించక సెంట్రల్ కమిటీ సభత్వమునకు రాజీనిచ్చాడు. రెండవ సోవియటు కాంగ్రెసులో, రష్యను సోవియటు సెంట్రల్ కమిటీ అధ్యక్షుడుగా ఎన్నుకోబడ్డాడు. కాని త్వరలో రాజీనామానిచ్చుటచే స్వెర్డ్లావ్ (Sverdlov) ఎన్నుకోబడ్డాడు. 1918–26 మాస్కో సోవియటు అధ్యక్షుడు. తర్వాత ప్రజామంత్రి సభయొక్క తాత్కాలికాధ్యక్షుడు. కౌన్సిల్ ఆఫ్ లేబరు డిఫెన్సుకు అధ్యక్షుడు 1923–24లో ట్రాట్స్కీ పక్షమును తీవ్రంగా ప్రతిఘటించాడు. కాని 1925 లో నూతన ప్రతికూలపక్షాన్ని లేవదీసి1926లో ట్రాట్స్కీతో కలసి ఐక్య ప్రతికూల పక్షాన్ని ఏర్పర్చాడు. 1927లో పార్టీనుండి వెళ్ళగొట్టబడి తప్పిదముల నొప్పుకొనుటచే తిరిగి చేర్చుకోబడ్డాడు. 1931లో తిరిగి వెళ్లగొట్టబడి జైలులో నుంచబడ్డాడు. చాలాకాలం సోవియటు ప్రభుత్వంయొక్క డిప్లమాటు (Diplomat)

టామ్‌స్కీ (Tomsky) :— జననం 1880. వృత్తిరీత్యా లిథోగ్రాఫరు. బోల్షివిక్కు. 1905లో రెవెల్ పట్టణప్రతినిధి. 1906లో సైబీరియాకు ప్రవాస మంపబడ్డాడు కాని తప్పించుకొని పీటర్సుబర్గు చేరి పార్టీ పనిని సాగించినాడు. 1908లో తిరిగి అరెస్టు కాబడి ఏదేండ్లు పారిపోయాడు. 1917లో మాస్కోలోను, పెట్రోగ్రాడులోను పనిచేసినాడు. అల్ ట్రేడు యూనియన్ కాంగ్రెసుతో సెంట్రల్ కౌన్సిల్ ఆఫ్ లేబరు యూనియన్ల ప్రెసిడియం కెన్నుకోబడ్డాడు. 1?1?నుండి [illegible] కమ్యూనిష్టుపార్టీ సెంట్రలు కమిటీ సభ్యుడు. సెంట్రలు కమిటీ ఆఫ్ ట్రేడుయూనియన్ల అధ్యక్షుడు. C.P.S.U సాపిట్ [illegible] లో మెంబరు. ట్రాట్స్కీయిజమును గూర్చి మితవాదము. సమర్థించుటను దృఢంగా చెప్పాలి

రెండవ అంతర్జాతీయ సంఘు ( Second Inter National ) తాత్త్విక వేత్తలగు హెల్ఫర్డింగే ప్రభృతుల ( Organised Capital) ఆర్గనైజ్డ్ కాపిటల్ అను సిద్ధాంత మొకటి. అంటే సామ్రాజ్యవాదములో కాపిటలిజంలోని అంతర్విరుద్ధాలు ( Contradictions ) అంతర్ధానమగునని, ఆర్థికదుస్థితులు (Crises) లేకుండా ఒకప్లాను ననుసరించి ఉత్పత్తి విధానము నడుచుననీ ప్రచారములో నున్నది. దీనికి మూలము కాట్స్కీ (Kautsky) యొక్క ఉల్ట్రా ఇంపీరియలిజం(Ultra Imperialism) . ఇది గత1914–18 సామ్రాజ్యవాద యుద్ధపు రోజుల్లో కాట్స్కీచే ప్రచారము చేయుబడ్డది. క్లుప్తంగా దీని అర్థమేమిటంటే ప్రపంచము యొక్క అన్ని సామ్రాజ్యవాద దేశాలు ఏకమై, ఇంతా ఫైనాన్సు కాపిటల్ యొక్క అంతర్జాతీయ సమితిమూలంగా యుద్ధముల నిరోధించి ఈవిధంగా కాపిటలిజంలోని అంతర్విరుద్ధాలను సమయజేసి సామ్రాజ్యవాదము విజృంభించును. ఈ ఉల్ట్రా ఇంపీరియలిజమునే లెనిన్ ఖండించి సామ్రాజ్యవాదమంటేనే కాపిటలిజంలోని అంతర్విరుద్ధాల విషమస్థితి యని, ఉల్ట్రా ఇంపీరియలిజం అంటే కాపిటలిజం యొక్క అంతర్విరుద్ధాలను సరకుజేయక పోవుట యనీ నిరూపించాడు. ట్రాట్స్కీయిజం అంటే లెనిన్ సిద్ధాంతాలపై ఆధారపడిన ఒక ప్రత్యేకదేశంలో సోషలిజం విజయమును గూర్చిన సిద్ధాంతమునకు ప్రతికూలత. యుద్ధపు దినములలోనే లెనిన్ చెప్పినట్లుగా ఈ ట్రాట్స్కీయిజం తలయెత్తింది. ఎంతగా మార్కిస్టు వేషాలు వేసినా ఆసిద్ధాంతాలు కాట్స్కీ సిద్ధాంతాలకు తీసిపోలేదు. ఆకాలంలో సామ్రాజ్యవాద యుద్ధాన్ని అంతఃకలహంగా(Civil war) జేయుమని, మొదటగా 2, 3 లేక కొన్ని దేశాలలో సోషలిజం విజయాన్ని గూర్చిన లెనిన్ సిద్ధాంతాలను ట్రాట్స్కీ ప్రతిఘటించాడు. లెనిన్ సిద్ధాంతాలకు ప్రతిగా ఈతని సిద్ధాంత మేమిటంటే "రాజరికాలుగాని (Monarchies) స్టాండింగ్ ఆర్మీలుగాని లేని యూరపు సంయుక్త రాష్ట్రాలు" అనగా సోషలిస్టు విజయానికి ముఖ్యావసరమగు

యూరపుదేశాల బూర్జువా-డిమోక్రటిక్ యూనియన్ ఏర్పడ లి. ఈ ట్రాట్స్కీ సిద్ధాంతము "యూరపియను సామ్రాజ్యవాద దేశాలు ఒక యూరపియన్ సూపరు ఇంపీరియలిజముగా మారుతుంది" అన్న కాట్స్కీ సిద్ధాంతరూపము కాక మరేమీకాదు. ఈనవీన ఆర్థికవ్యవస్థ యగు సామ్రాజ్య వాదమున నొక ముఖ్యచారిత్రిక స్థాన మున్నదం టాడు. జాతీయభేదాలు, దిగుమతి పన్నులు మొదలైనవి లేని స్వతంత్ర సమిష్టి అంతర్జాతీయ ఆర్థిక వ్యవస్థలో రష్యా పారిశ్రామికవర్గ విప్లవవిజయం చిరకాలం నిలవదనీ, ఏ ఒక్క దేశంలోను ముఖ్యంగా రష్యాలో సోషలిజం స్థాపన నెరవేరదనీ' అంటాడు. 'లెనినిజం'కు ప్రతిగా 'ట్రాట్స్కీయిజం, పోరాటం'యుద్ధపు దినాలలోనుండి 1925 1926కిప్రాకి జినోవివ్, కామినిల్ మతాలతో ఏకమైంది. కాని లెనిన్ యొక్క తీవ్రప్రచారము, ట్రాట్స్కీయిజం ఖండన ఈ సిద్ధాంతముల నాశనమునకు కారణభూతమయినది.

టాట్స్కీయిజంలోంటే ఇంకా, గ్రామములోని కర్షకతరగతి సోషలిస్టు నిర్మాణానికి వ్యతిరేకులనుట. దీన్నిబట్టి, స్వంత ఆస్థుల నొదిలిపెట్టి సమిష్టి వ్యవసాయమునకు కర్షకుల నాకర్షించ శ్రామికవర్గు బలహీనమైదని, త్వరలో అంతర్జాతీయ విప్లవం కల్గకపోతే కర్షకసామాన్యం పాతబూర్జువా పద్ధతిని తిర్గి నెలకొల్పుతారనీ తేలుతుంది. "ప్రపంచవిప్లవం" అనే తీవ్రవాక్యాలతో కప్పబడ్డా, ఇది శ్రామికవర్గ నియంతృత్వమును గూర్చిన నిందలేగాని వేరేమీ కాదు. ఇటువంటి తప్పుదుసిద్ధాంతాలను ప్రచారం చేస్తూ కర్షకతరగతిని, సోషలిస్టు పునర్నిర్మాణానికి సాయపడ జేయగలమా?

సమయానుకూలపరులగు మితవాదుల (Right Opposition)వాదం దీనికి భిన్నంగా కన్పించినా చివరకు రెండూ ఒకటే. బుఖారిల్, రైకావ్, టామిస్కీలు నాయకులుగా గల ఈ మితవాదులు సోవియట్ యూనియన్‌లో సోషలిజం నెలకొల్ప అసాధ్యమనరు. పైగా

అవసరం అంటారు. అయితే వారికి దాన్ని నెలకొల్పే విధానం నచ్చదు. దేశంలో సోషలిజం నెలకొల్పేముందు పారిశ్రామికాభివృద్ధి కావాలి. ఇది కాదంటారు. కాపిటలిజంయెడ నిర్దాక్షిణ్యమైన పోరాటం సాగించ నక్కరలేదంటారు. కాపిటలిస్టు విధానంయెడ ఎడతెగని వర్గ పోరాటం అనవసర మంటారు. ఒకదేశంలో శ్రామికవర్గ నియంతృత్వం నెలకొల్పి సోషలిజాన్ని ప్రవేశపెట్టుటకు అవసరములైన ఈ పైపద్ధతులను వారు నిరసిస్తారు. వర్గపోరాటం అవసరం లేకుండా కాపిటలిస్టుతత్వాలతో పోరాడకుండా 'శాంతంగా'సోషలిజం నిర్మించ సాధ్యమగునంటారు. కాపిటలిస్టు ప్రకృతులు తమంతట తామే నాశనమవుతాయనీ, లేదా సోషలిజంగా మారుననీ వారి వాదన. కాని చరిత్రలో **Miracles** కు తావులేదు. వారివాదననే కొనసాగించితే ఒకదేశంలో సోషలిజం నిర్మించ అసాధ్యమని తేలుతుంది.

కర్షకతరగతిని సోషలిస్టు విధానమునకు లాగుట అసాధ్యమనరు. ఇది కూడ ట్రాట్స్కీయిజంకు భిన్నమే. కాని ఆకర్షించుటకు మార్గాలువేరు. సోవియటు సంస్థలు సమిష్టివ్యవసాయమే వారిని సోషలిజంలోనికి లాగుటకు మార్గములని వారొప్పుకొనరు. పెద్దభూస్వాములను లిక్విడేటు చేయుటకు వారొప్పుకోరు.

'కన్నమర్సు కోఆపరేటివుల వల్లనే స్వాభావికముగా వర్గకలహం లేకుండా వారు సోషలిజానికి తోడ్పడుతారని అంటారు. ఎందుచేతంటే భూస్వాములు సోషలిస్టు విధానాన్ని స్వీకరించు తారట. పారిశ్రామికాభివృద్ధి, సోవియటులు, సమిష్టి వ్యవసాయముల అభివృద్ధి కాదు వారుకోరేది. మార్కెటుల 'స్వేచ్ఛ'; ప్రత్యేకవ్యక్తి వ్యవసాయము స్వేచ్ఛ; (భూస్వాములకు కూడా) మార్కెటు శక్తుల 'స్వేచ్ఛ' వీరు కోరేది. కాని కులాక్సు **(Kulaks)** (పెద్ద భూస్వాములు)సోషలిజంకు మారరు కాబట్టి 'స్వేచ్ఛ' యన్నది బూర్జువా - డెమొక్రాటిక్ ఆదేశం కాబట్టి, స్వేచ్ఛవల్ల కాపిటలిస్టుల బలపరచి శ్రామికవర్గాన్ని అసహాయుల జేయుటకాబట్టి, ఆచరణలో వీరివాదం యేమిటంటే,

కర్షకతరగతిని సోషలిస్టు విధానానికి ఆకర్షించుట అసాధ్యమనియే. ఇది మార్క్సిజం-లెనినిజం సిద్ధాంతములపైన వర్గ కలహానికి వ్యతిరేకంగా పెటీ-బూర్జువా మితవాదాన్ని స్వీకరించుట యన్నమాట. మనదేశంలో స్వల్ప రాజకీయ నేరాలకే కఠినశిక్షలు విధించుచుండగా సిద్ధాంతాలకే వ్యతిరేకమై సోవియటు రాజ్యాన్ని, కమ్యూనిస్టుపార్టీని, నాయకులను నాశనంజేయ కుట్రలుసల్పిన వ్యక్తులకు పైశిక్షలంత ఘోరముకాదని అభిప్రాయపడుచున్నాను.

## బొట్టు

పరిగెత్తి నన్నంటి—పట్టుకోరమ్మంటె
ఏమేమొ సేస్తావె నా మావా! ఇటుసూడు నావొంక నా మావా!!

రంగి కొప్పులో నుండి — రాలి పోతున్నాయి
జాజి పూరేకులు — జాతి రత్నాలంట
ఏరుకుంటున్నావె — నా మావా!
ఎట్టి పట్టిందేమి — నా మావా!!

రంగి సెక్కిళ్ళంటి - రాలి పోతున్నాయి
ముద్దు సెమ్మటబొట్లు - ముత్తాల సరవంటు
అంసుకొంటున్నావె - నా మావా!
అందులోనే వుంది - నా మావా!!

రంగి కాళ్ళంటాయి — రాలి పోతున్నాయి
మెత్త మెత్తని దుమ్ము - మేలి కుంకోమంటు
బొట్టెట్టు కుంటావె - నా మావా!
పొద్దు పోలేదేమొ - నా మావా!!

పరిగెత్తి నన్నంటి పట్టుకో రమ్మంటె
ఏమేమొ సెస్తావె నా మావా! ఇటుసూడు నావొంక నా మావా!!

శంకరంబాడి సుందరాచారి

# అభినయకళ

పాటిబండ మాధవ శర్మ, యం. ఏ. (ఆనర్సు)

కళకు సృజనశక్తి ప్రధానం. ప్రతి కళా ఒకసృష్టి. కవిత్వం ఒక ప్రపంచాన్ని సృష్టిస్తుంది. అందులో భిన్నభిన్న స్వభావాలు గల వ్యక్తుల్ని సృష్టిస్తుంది గానం నాదబ్రహ్మాన్ని సృష్టిస్తుంది. చిత్రలేఖనం సుందర రూపాల్ని సృష్టిస్తుంది. ఇలా ప్రధానకళలన్నీ సృజనశక్తి కలవే.

"అవస్థాను కృతి ర్నాట్యమ్" అని భరతముని ఆదేశించాడు. నాట్యం ఒక అవస్థను అనుకరిస్తుంది. చిత్రలేఖనం ఒక అవస్థను సృష్టిస్తుంది. గానం ఒక అవస్థను సృష్టిస్తుంది. కవిత్వం ఒక ప్రపంచాన్నే సృష్టిస్తుంది. అనుకరణమే ప్రధానంగా కలిగి సృజనశక్తి లేని నాట్యం ఇందు చేతనే అప్రధానకళగా పరిగణించబడ్డది.

ఇది ఇలావుండగా "అభినయకళ" అనే వింతపదం ఒకటి వినబడు తోంది. అభినయం కళయేనా? కాదని నా అభిప్రాయం.

ఎందుచేత?

అభినయం రెండుభాగాలు. వాచికం- ఆంగికం. ఆహార్యకాన్ని కూడా ఆంగికంలోనే కలిపి వేస్తున్నాను. కారణమిది.

తాత్వికదృష్టితో పరిశీలించినప్పుడు సృష్టి అంతా రెండంశాల కూడిక— ఒకటి శబ్దం, రెండు వర్ణం. ఈ శబ్దమే ఓంకారమనీ, వర్ణమే తేజస్సనీ నాభావం. ప్రపంచంలోని ధ్వని అంతా ఈ శబ్ద వికారం. రూపమంతా ఈ వర్ణ వికారం. శబ్దంయొక్క లయాత్మకమైన చలన మే సంగీతం. వర్ణంయొక్క లయాత్మకమైన చలనమే నృత్యం. (**Music is sound play, and dance is colour play**) వీటిలోని లయయే సనాతనమైన ఈశ్వరాంశ— మూలశక్తి. ఈ శక్తి లేక లయ లోపించినప్పుడు లేదా కొరవడినప్పుడు గానం వచనంగాను, నృత్యం చలనంగాను మారిపోతవి. ఈ వచన చలనాలనే మనం లోకంలో అనుభవిస్తున్నాము. ఆహార్యం వలెనే ఆంగికం కూడా వర్ణవికారమే గనుక

ఈ రెంటిని కలిపి వేస్తున్నాను. ఇక ప్రకృతం మనవి చేస్తాను.

ఇప్పుడు ఆంగికమైన నాట్యం ఒక కళ. వాచికమైన కవిత్వం ఒకకళ. నాట్యంలో అంతర్భాగంగా చిత్రలేఖనం, కవిత్వంలో అంతర్భాగం గా గానాన్ని తీసుకుని నటుడు అభినయం చేస్తాడు.

ఇక్కడ అభినేత చేస్తున్నపని యేమంటే భిన్నములుగా వున్నకళలను ఒకప్రయోజనాన్ని ఆశ్రయించి ఏకముఖం చేస్తున్నాడు. వాక్కు ద్వారా వర్ణితమైంది ఒక అవస్థ. నాట్యంద్వారా వ్యక్తమైంది ఆ అవస్థయే. ఈ రెండు విధానాలను ఏకముఖం చేసి ద్విగుణీకృతశక్తి తో ఆ అవస్థను ప్రదర్శించడమే అభినేతపని. ఈ అభినయం సృష్టి చను. పరిష్కరిస్తుంది. కవివాక్కుకు నాట్యం ఇంకొకరూపం. ఈ రెండు కళలయొక్క సమీకరణం (Co-ordination) అభినయం. ఇది ఇలా లభ్యమవుతుంది. కేవలం శిక్షవల్ల, అభ్యాసంవల్ల.

కవి రసమూర్తి. అతడు రసాన్ని అనుభవించే మనకు వాగ్రూపాన అందిస్తాడు. నటుడూ రసమూర్తియే. అతనూ రసాన్ని అనుభవించే మనకు నాట్యరూపాన వ్యక్తంచేస్తాడు. మొదటివాడికి వాక్కే సాధ నం. రెండోవాడికి చలనమే సాధనం.

అభినేత ఈ రెండు సాధనాలనూ అతికి ( Synchronize ) ప్రదర్శిం స్తాడు. ఈరెండు కళలనూ కలపడంలో అతను కవికి దాసుడు. ఎందు చేతనంటే కవి వాక్యానికి ఈషద్భిన్నంగా అయినా అతను అభిన యించరాదు. అలా చేశాడా కవి సృష్టించిన పాత్రకంటె భిన్నమైన పాత్రను అతను సృష్టించినట్లు. అప్పుడు సమిష్టి పాత్రలో శుద్ధి నశిస్తుంది నోటితో పొగుడుతూ నొసటితో వెక్కిరించే వ్యక్తిలో ఏమి శుద్ధి వుంటుంది. ఈ శుద్ధి చెడకుండా కవిత్వాన్నీ, నాట్యాన్నీ కలిపేవాడు అభినేత. ఇతణ్ణే నర్తకుడని వ్యవహరించారు. వీనికి ప్రజ్ఞకంటే వుం త్పత్తి మిక్కిలిగా వుండాలి. ఇతను సృష్టించడు. కేవలమూ సమీ కరిసాడు.

"శిక్షాభ్యాసాది మాత్రేణ రాఘవాదేః స్వరూపతాం
దర్శయన్ నర్తకో నైవ రసస్యాస్వాదకో భవేత్."

కవిత్వంలో కవి తాదాత్మ్యం పొందుతాడు. నాట్యంలో నటుడు తాదాత్మ్యం పొందుతాడు. అభినయంలో నర్తకుడు జాగ్రుతి వహించాలి. లేకపోతే సమీకరణంలో దోషాలు దొర్లుతవి.

తాదాత్మ్యం కళకు ముఖ్యలక్షణం. జాగ్రుతి శాస్త్రమునకు లక్షణం. అభినయము శాస్త్రమే కాని కళ కాదు. నటునకు నర్తకునకు మనము భేదమేర్పరుచుకోవాలి.

చిరకాలంనుంచీ వున్న జిజ్ఞాసయే ఈ రచనకు కారణం. సాహసంగా వుంటే శపించక సాధురీతిని పరిశీలించ గోరుచున్నాను.

## నీతే వుంటే!

రాతిలో నేనని
రప్పలో నేనని
అమాయకులను
మాయంజేసి
గుడులు గోపురాల్
గొప్పవి మెన్నో
ఖర్చెట్టించి
పదిలముగాను
పడుకొన్నావా!

కష్టంచేసీ కట్టిన వాళ్ళు
ఉండుటకిల్లు
తిండికి ధాన్యం
లే కేడుస్తూ
చాకిరి జేస్తూ
ఎప్పటికైనా
చెప్పడా? మనకని
ఉన్నారయా మరి
సున్న జేతువా!

నీతే వుంటే
నీ విటకొచ్చి
కష్టాలన్నీ
కరిగే టట్లు
ఆగ్రహించక
హరించు చూదాం!

చదలవాడ పిచ్చయ్య చౌదరి

# చణ్డీదాసు

నాటిక　　　　　　　　　　　　　　　　　　　　కృత్తివాస తీర్థులు

రాత్రి ఎనిమిదిగంటలు. చల్లని పండు వెన్నెల. విశాలమైన సరస్సులో చిన్నఅలలు వెన్నెల్లో వెండిలా మెరిసి పోతున్నవి. సరస్సుకు తూర్పు వైపున మంచు ముద్దవలె తెల్లని దేవాలయ శిఖరం కనపడుతున్నది. సరస్సుకు పడమర సొగసైన తోట. తోటలో సన్ననై పొడుగైన పోకచెట్లు తలలూపుతున్నై. వాటితోపాటు పొడవైన నీడలు కదుల్తున్నవి. సరస్తీరాన నల్లని రాతిబండ వున్నది. బండపక్కని గరుడవర్ధని కలయ పూచి, ఒక్కొక్క పువ్వునే వదలి వేస్తున్నది. రాతిమీద పదహారేళ్ళ జవ్వని కూర్చొన్నది. చామనచాయ. సన్నగా పొడవుగా లేడీగెలా నాజూకుగా వున్నది. తల దువ్వుకోక పోవడమువల్ల బాల చంచరీకపు రెక్కలగమి లాటి కభరీభరం చెల్లాచెదరై, నెమ్మోమును పై బడుతున్నది. మృదువుగా కదుల్తున్న సరస్సులో అలల గతులు జాలిగా చూస్తున్నది. ఆమే 'రజకీరామ' ( రాముమణి )

రాముమణి

నా ప్రియుని కన్నుకొలకుల్లో తళతళ మెరిసే సంతోషాశ్రువుల వలె వున్నవి ఈ వొయ్యారపు లేత అలలు. అతను వస్తానన్న వేళ దాటి పోతున్నది. ఏం చేస్తున్నాడో ఇంతసేపు. అతను రాకపోతే ఈవెన్నెల రాత్రి గడపలేను. సంపెంగ పూవుల కమ్మనెత్తావులతో నా మత్తు మరీ ఎక్కువైనది. అక్కడికీ నేను వచ్చేతోవ అతనికి తెలియదేమో నని ఇసుక తిప్పల్లో నా అడుగు జాడలు స్పష్టంగా వేస్తూ వచ్చాను ఈ కాసారం దగ్గిరికి. హడావిడిగా వస్తూ అడుగుజాడలు చూడడము మరిచిపోయి, నాకోసం వెర్రిగా అన్వేషిస్తాడేమో ... ... ...

( జారిన పైట సర్దుకొని మెడలో హారం చూచు కొంటుంది. కొంత తెగిపోయిన ముత్యాలకోవ, చూచుకొంటుంది. )

నా తొందరకు, స్తన పరిసరచ్ఛిన్నమై, ముత్యాలు తెగి తోవలో పడి వుంటవి! అమ్మయ్యా! ఫరవాలేదు. అది చూసైనా తోవ తెలుసుకోక పోడు. ఈ యౌవన మంతా అతనికి సమర్పణ చెయ్యనిదే నా బ్రతుకు వ్యర్థం. అతను రాకపోతే ఈ సరస్సే నాకు గతి. ...... అదుగో దేవాలయపుగంట గణగణ మోగుతున్నది. రావాలి అతను ఒక్కటైనా అబ్బ, ఎలా జీవించేది! ఇంకా రాడు. రోజూ సాయం కాలం మల్లెలు సంపెగలు మాలలు కట్టి చండీదాసుకు యిస్తుంటే వాటిని అల్పంగా గ్రహించాడా? నాప్రియుడు అలాచేస్తాడా? అబ్బ అతని కరస్పర్శ చంద్రికాసుధలను చిందించినది. తలుచుకొంటే వొళ్లు పునీత మవుతుంది. అతని వెచ్చని కౌగిట్లో వొదిగి వేడి ముద్దులు చిరుపెదిమిల మీద ఎప్పుడాను తానో. అయ్యో అతను లేనిదే యీ రాత్రి— యీ వెన్నెలరాత్రి— మంచులా గడ్డకట్టుకు పోవలసినదే ఇంకా రాడేమి?

[మల్లెపువ్వులు కోసితెచ్చి, వొళ్లోంచి వకటొకటే తీసి రాతిఅరుగు మీదపరుస్తుంది. అరుగు మల్లెలతో నిండిపోయింది.]

అతను విశ్రమిస్తే మెత్తగా పట్టులా వుంటుంది. నా బాహువు తలగడాగా యిస్తాను, అతని శిరస్సుకు నెప్పిలేకుండా. నేను తలచక్కగా దువ్వుకోలేదని, బాగా సొగసుగా లేననీ రావడం మానివేస్తాడా? నాప్రియుడికి నేను అందగత్తెను గానూ? ఆఁ వచ్చాడు. అదుగో మల్లి పందిరిదగ్గర—!

[అరుగు దిగి మెల్లగా నిట్టూర్పులు వదుల్తూ గబగబ నడుస్తూ మల్లె పందిర చేరుతుంది.

చండీదాస్! వొస్తున్నా. దా నా కౌగిట్లోకి, నీడనుచూచి అత నను కొన్నాను. పోకచెట్టు దగ్గిర కనపడుతున్నాడు.

( పోక చెట్టును కౌగలించుకుంటుంది ప్రేమావేశం కొద్దీ )
ఇలాగ గుచ్చుకొంటున్నదేం? నేనతన్ని కౌగలించుకోవడం చేత గగుర్పాటు చెందినదీ శరీరము.

[అరమోడ్పు కన్నులు తెఱచి తేరిపార చూస్తుంది.]

అయ్యో పోకచెట్టిది! నా ప్రియుడనుకొని వెర్రినై గాఢముగ కౌగలించుకొన్నాను. మల్లెపందిరి దగ్గర నీడచూచి అతనే వచ్చాడని గబగబ వచ్చాను, నాగతిఏమికాను? ఎంతని వెతకను? ఈ రాత్రి మా యింటికి పోతే నన్ను బ్రతకనివ్వరు. మాకులంవారు నన్ను పట్టుకొని నానాబాధలు పెడతారు. నాకు వారెవ్వరూ దిక్కుకారు. అతనే నాదిక్కు. అతను నాప్రియుడు. (నిశ్శ్వాసము)

సమస్తమూ అతనికి అర్పణ చేస్తాను. నాబ్రతుకు అతనికి నీరాజనం యిస్తాను. ఇంకా రాడేఁ! (దిక్కులు కలయ చూస్తుంది. కళ్ళల్లో గిరున అశ్రువులు) ఇక నేను నిలవ లేను. సరస్సులో కలసిపోతాను. అతనికోసం బాధపడుతూ, అతను వస్తాడని మల్లెపువ్వులు పరచాను రాతిబండమీద. నే నీ సరస్సులో లీనమైతే, ఈ పూలు అతని స్పర్శ వల్ల వికసించుతాయేమో. పువ్వులు అంత అదృష్టం చేసుకొన్నవి.

(సరస్సులో పడి పోతుంది రామీ 'చండీదాస్' అని అరుస్తూ. ఆ రాత్రి నిశ్శబ్దతకు భంగము కలిగినది. తెల్లనిదేహము నీటిలోని ఆమె శరీరమును తాకును. హఠాత్తుగ నీటిలోనుంచి పైకి లేస్తుంది. ఆమె ముఖంలో వింత ఆశ్చర్యం. అతని ముఖముమీద తెల్లని ఆచ్ఛాదనము తొలగించి, తేరిపారచూసి నివ్వెర పడుతుంది.)

అయ్యో! అయ్యో! నాప్రియుడే! చండీదాస్ ఎలావొచ్చాడీ నీళ్ళల్లోకి, నన్ను రక్షించడానికి రెక్కలు కట్టుకొని వచ్చాడేమిటి!

(అతన్ని కదుపుతుంది)

కదలడు! మెదలడు!

[దోసిలి నీళ్ళు తెచ్చి అతని ముఖంమీద చల్లుతుంది. కొంచెం అతను తెప్పరిల్లుతాడు. తన తొడమీద అతని శిరస్సు వుంచుకొని అశ్రు సిక్తములైన తన నయనాంచలములను చీర కొంగుతో పదేపదే తుడుచుకొంటూ అతన్ని చూస్తున్నది. చండీదాసు బొటన వేలుకు దెబ్బ తగలడం వల్ల రక్తము చిమ్ముతున్నది, ఆమె ఖంగారు పడుతూ తన చీరకొంగు చింపి, రక్తము రాకుండా వేలుకు గట్టిగా కట్టు కడుతుంది. అతనికి తెలివి వస్తుంది. కళ్ళు తెరచిచూస్తాడు రామిని)

చండీదాసు

రామీ నీకు శ్రమ కల్గించాను. పాపం నాకోసము చాలా కష్టపడినట్లున్నావు

రామి

నా కేమీ శ్రమలేదు. నీకై శ్రమపడితే నా జన్మ ధన్యమేకద. ఈ నీళ్ళల్లోకి ఎలా వచ్చారు?

చండీదాసు

(బ్రాహ్మణు లందరూ దేవాలయంలో ఏకమై నన్ను దేవాలయ స్తంభానికి కట్టి 'రామిని ప్రేమించడం మానుతావా మానవా' అని కొట్టి స్మృతి తప్పిపోగా నన్ని సరస్సులో పడేశారు. రామీ పాపం వాళ్లని ఏమీ అనకు.

రామి

సనాతను లెంత విశాల హృదయులో ఇప్పటికి బాగా తెలిసింది. నా మూలాన నానా బాధలు పడ్డారు. (అతని వొంటిమీద ఉత్తరీయము తొలగించి బుజాలు పరీక్షిస్తూ) ఇవిగో బుజాలు ఎలా పొంగి వాచి పోయాయో! అబ్బ! కొట్టడానికి, తాళ్ళతో అతికోమలమైన శరీరాన్ని కట్టడానికి చేతులు ఎలా వొచ్చాయో వాళ్ళకు. ఎర్రగా ఎలా పొంగాయో బుజాలు! అబ్బ! నే నీ దెబ్బలు చూడలేను! చూడలేను నా చండీ ... చండీ (ఆమె కళ్ళు కన్నీటితో నిండిపోతవి. చండీదాసు

తన ఉత్తరీయాంచలముతో ఆమె కన్నులు తుడిచి తన వొళ్ళోకి చేర్చు కుని, తల నిమురుతూ)

చండీదాసు

రామీ దుఃఖపడకు. నన్ను అంతమంది కలిసి కొట్టినా, నిన్ను తల్చు కొంటూ బాధ సహించాను. రామీ ఏడవకు. నీ లేత హృదయం ఇప్పటికే వియోగం వల్ల విపరీత ఖేదమనుభవించింది. ఇక దుఃఖము భరించలేవు. నిద్రలేక, ఏడవడంవల్ల చూడు నీ కళ్ళు ఎర్రగా చింత నిప్పులా వున్నాయి. (పాదాలు తడుముతూ) ముఖమల్ కంటె అతి మెత్తని పాదాలు ఎలా గిట్టిపడ్డాయో!

రామీ

.. ... ... ... ...

(అతని కౌగిట్లోవుండి ఏమీ మాట్లాడదు. సగము ముకుళించిన కలువల్లా వున్నవి ఆమె నేత్రాలు)

చండీదాసు

అద్దముల వంటి నీ కపోలాలలో నా ముఖము కనపడేది. ఎలా వాడి పోయినవో నీ గులాబీ చెక్కిళ్ళు! సోగలై విశాలములై ఉజ్జ్వలములైన నీ నేత్రముల కొనల కన్నీటి తుంపురులు భిన్న మౌక్తికాల వలె వున్నవి నారామీ. ఈ నిశ్శబ్ద గంభీరమైన వెన్నెల రాత్రి ఆనందం అనుభవిస్తూ వియోగభారాన్ని వదిలి వేదాము.

రామీ

(అతని గడ్డము చివర తన వేలితో మృదువుగా తాకుతూ)

చంద్రశిల వంటి నా హృదయం నీ ప్రేమామృత జ్యోత్స్నలచే కరిగి పోయింది. రహోమధురిమ అనుభవిస్తూ ప్రకృతి పురుషులవలె ఐక్య మౌదాము. వనమంతా నీ కోసం వెతికాను. డస్సిపోయాను. నా యౌవనపు సంపద నీకు ఎప్పుడు సమర్పణ చేస్తానా అని తహతహ లాడి పోయాను.

చండీదాసు

నీలాగా నేను వియోగ వేదన అనుభవించాను గుడి దాటితే నన్ను చూసి అనుమానించేవారు మావూరి బ్రాహ్మణులంతా. నన్ను కదలనిచ్చేవారు కారు గుడిదాటి. నన్ను కొట్టి, నీళ్ళలో పడేయడము చాలా మంచిపని. ఒకసారి నిన్ను చాకిరేవుదగ్గర కలుసుకొని దేవాలయానికి వస్తూంటే, గుడి ధర్మకర్త నన్ను గట్టిగా చివాట్లుపెట్టి, కొట్టి, 'వెలివేస్తాను జాగ్రత్త. గంగకూడా యీవూళ్ళో పుట్టనియ్య'నని బెదరించాడు. అవన్నీ తల్చుకొన్నకొద్దీ మనస్సు కష్టపడుతుంది రామీ. ఏమీతోచక ఏకతార్ వాయించుకొంటూ విరహగీతాలు ఆలాపించే వాణ్ణి. దేవాలయపు మర్రిచెట్టు బోదెమీద నా పద్యాలన్నీ గంటంతో చెక్కినాను.

రామీ

ఆ విరహగీతాలు నాకు వినిపించవ్వూ? ఆ మర్రిచెట్టు నాకు చూపించవు?

చండీదాసు

దేవాలయంలో నన్ను అడుగు పెట్టనీయరు. ఊళ్ళోకి వెడితే బ్రాహ్మణులు నన్ను బతకనియ్యరు.

రామీ

మీ అగ్రహారం ఎలా వదులుకొంటావు?

చండీదాసు

అగ్రహారానికీ నాకూ సంబంధమేముంది రామీ! మనం చాకలిపేటలో చెరువుదగ్గిర పూరిల్లు కట్టుకుని అక్కడ కాపురముండవచ్చును. అక్కడి రమణీయమైన ప్రకృతిని తిలకిస్తూ, బుల్‌బుల్ పిట్టలతో కూడా నేను పాడుతూంటాను. ఉదయమే లేచి గురివిందపొద దగ్గిర రాతిబండ మీద కూర్చుని, గాలికి గురివిందలు ఒక్కొటొకటే రాలుతూ వుంటే ఎన్నో కావ్యాలు రాస్తాను నీమీద. ఏకతార్ వాయించు

కొంటూ దిరిసెనచెట్లకింద మూగవెన్నెలలో నిన్ను నావాళ్ళో చేర్చు కొని ప్రేమ గీతాలు రాస్తాను. అంతకన్నంటే మనకేమి ఆనందం కావాలి రామీ! చాకలివాళ్ళకు నే నంటే యిష్టమేకదూ.

రామీ

మొన్న సనాతనులు చాకలిపేటలో మా యిల్లు తగలెడుతూంటే నన్ను మీరు మంటల్లో నుంచి తప్పించి రక్షించే సరికి మీరంటే చాకలి వారందరికీ చాలా భక్తి గౌరవము కలిగినవి.

చండీదాసు

చాకలిపేటలో వున్న వాళ్ళకు హృదయ మంటూ వున్నది. వాళ్ళని చూస్తే నా హృదయం వెన్నెలా కరిగి పోతుంది. రామీ కెంపుతునక లాంటి నీ పెదిమెలు ఏవి?

(ముద్దు పెట్టుకొని, గొంతెత్తి పాడతాడు. పాటవింటూ నిండుకళ్ళతో అతని ముఖం తనివితీర చూస్తుంది రామి.)

వింటినై నేనుండ
గుణము నీవైయుండ
చంద్రుడను నేనై
చంద్రికయు నీవై
పారలో నీళ్ళవలె
ప్రకృతి పురుషుల్లాగ
ప్రణయైక్యమౌదామె.

* *

తీయతేనియ మించు
సఖియ నీ మోవి
నవ సుధా లావణ్య
నవకంబె మోము

పలుకులే రత్నాల
తునకలే దేవి!
హృదయమే నవనీత
సదృశమే సుమ్మి!
నిన్ను మించిన మూర్తి
లేదీ జగతిని
నీవె నా భాగ్యమవు
నీవె నా సర్వంబు
నీవె నా జీవనము
నా ప్రేమ మూర్తివే
నా రామి! నా రామి!!

రజకీరామి

నీతోడి ఐక్యంబు
నే పొంద గోరి
వేచియుంటిని నాథ
నా హృదయ నాథ
చిర వియోగము నేను
భరియింప లేక
తనువెల్ల తపియించి
దద్దరిల్లంగ
నీ కోసమై వెదకి
నీ పూవ్వుకై తిరిగి
నీ కమ్ర ముఖబింబ
చుంబనోత్సవముకై
వేచియుంటిని రార
వేసారి పోవుచును.
కాపాడవా! నన్ను
కరుణార్ద్ర హృదినో

వలపు కౌగిట జేర్చి
వలపు వంతలను దీర్చి
నీ లోన ఐక్యమ్ము
నను జేసుకోర!

చండీదాసు

నా రామీకి సాహచర్య విశేషం వల్ల కవిత్వం కూడా పొలపొంగు వలె వస్తున్నదే. రామీ నీ తేనెలూరే పాట వింటూ బెగ్గురు పిట్టలు రెక్కలు చాపుకొని నీలిసరస్సుపై చంక్రమణాలు చేస్తున్నవి.

ఎలమావి లేజిగురు
కడుమెక్కి హాయిగా
పాడేటి పరభృతపు
ప్రణయ గానము మించు
నీ మధుర గేయమ్ము.
నీ గాత్ర మృదు పరిష్వంగమ్ము
గగన శీతల ధునీ సీకరమ్మో-
మల్లికా సుమ దామమే!
పాలసంద్రపు నురుగులే!
మంచు తేనెల సోనలే!
దేవి నీ దరహాసం!
నా జీవన జ్యోతివి నీవె కావా?
నాప్రేమధామమా! ప్రేమమయీ!

రామి

నీ తోడి ఐక్యమ్ము
అమృతత్వమే నాథ!

ఒక్కసారి నా ముఖంమీద చల్లని తీయని చుంబనపు జల్లు వర్షించు కష్టాగ్ని లంఘితమైన పొదకు, వృష్టి పాతములాగా.

[రామిా నేత్రములు అతను చవులూర ముద్దుగొంటాడు. అతని పెదిమలకు కజ్జలనీలిమ సోకినది. ఆమె కళ్ళల్లో ప్రేమాశ్రువులు సుళ్లుతిరిగినై. సరస్సులో కర్ణరసాయనంగా మాదగానం, లయ వినపడుతున్నై. విహాగ దంపతులు జంటగా చంక్రమణాలు చేస్తున్నై వివశత్వంతో]

# *కవితాంజలి*

(మిత్రుడు ... శ్రీ వెంపటి నాగభూషణం ... కు:)

[—ఖండాంతర ప్రతిష్ఠా లక్షితుడైన ... ఆంగ్లకవి వ్యాస కారుడు, విమర్శకుడు, నాటక రచయిత: ఈతని హూణ పద్యావళి పాశ్చాత్య అభియుక్తుల ప్రశంసాంజలుల నలవరచు కొన్నవి.

నటుడు —— కళాభిజ్ఞుడు.

-ఆంధ్రంలో ... మేలి కథకుల కోవలోనివాడు.]

* *

వీణ మాలిమి తెలుగు రాణి - ది
వాణ మేలే...వయసు కాడవు:
హూణ వాణికి మనసు నచ్చిన
జాణవోయీ — భూషణా...

కలలు అలలై మెలసి పోయే
కనులు ... సుషమా దీధితులలో
పులకరించే కావ్యజ్యోత్స్నల
నిలువ నీడలు - భూషణా...

తీయ తేనియ లాను షట్పద
గాయనీ సంగీత వాహిను
లోయి-మధుర వసంత యామిను
లోయి, రచనలు- భూషణా...

—శ్రీమతి సుందర వర్ధని.

# సిల్కు సూటు

జనమంచి కామేశ్వరరావు

ఒక ఊరు. ఆ ఊళ్ళో ఒక చిన్నవాడు. అతనికి వాళ్లమ్మ అందమైన సిల్కు సూటు కుట్టించింది. దాని వర్ణం ఆకుపసుపు. బంగారపురంగు డోరియాలు కూడా ఉన్నాయి. "ధక్కామజ్లిన్" కన్న సన్నంగా ఉంది. చొక్కా బొత్తాములు తళుకు తళుకుమని తారల్లా మెరుస్తున్నవి. ఆ సూటు అందం ఇంతా అంతా అని చెప్పడానికి వీల్లేదు. చాలా అందంగా ఉన్నది. ఆ సూటు కుట్టించుకున్నాక వాడి ఆనందానికి మేరలేదు. వాడి గర్వానికి పట్టపగ్గాలు లేవు. మొట్టమొదటి రోజున ఆసూటు తొడుక్కొని నిలువుటద్దాని కెదురుగా నిలుచుని ఆరోజంతా తన అందాన్ని దాంట్లో చూసుకొని అదే మురిసి పోయినాడు. అద్దం వదలి ఎక్కడికైనా వెళ్లడమంటే ప్రాణసంకటముగా ఉండేది.

ఎక్కడికి వెళ్లినా ఆసూటు వేసుకోవాలని ఉంటుంది. అతనికి ఎవరికి పడితే వారికి చూపించ వలెనని అభిలాష. అంతవరకూ తను చూచి వచ్చిన వూళ్ళూ, వాటి ప్రకృతి చిత్రములూ. నానుడిగా విన్న ప్రపంచములో అద్భుతాలూ, ఈ సూటు వేసుకొని చూడబోతే, ఎల్లా ఉంటాయో అని ఊహా సూత్రాలపైన ఊహాసూత్రాలు అల్లుకొని భావనా ప్రపంచములో కేరింతలు కొడుతూ ఉండేవాడు. ఆ సూటు వేసుకొని హఠాత్తుగా ప్రచండభాను కిరణ ప్రసారంలో మిలమిల మంటూ మెరిసే శాద్వల స్థలాలమీదికి పోయి ఆడకుండలేని ఉత్సాహంతో పల్టీలుకొడుతూ, మొగ్గలేస్తూ ఉందామని ఎంతో సరదా పడేవాడు. ఇదంతా ఎందుకంటే, ఊరికే ఒక్కసారి తొడుక్కుందామని. అంతే!. కాని వాళ్లమ్మ ఆసూటు "వేసుకోవద్దు" అంది. దాన్ని జాగ్రత్తగా ఉంచుకో మన్నది. పాడుచేసుకుంటే అంత అందమైనది మళ్లీ ఎప్పుడూ కుట్టించనని భయపెట్టినది. దాన్ని దాచుకుని దాచుకుని ఎప్పుడైనా ఒక పండగనీ పబ్బమనీ వచ్చినప్పుడు వేసుకోమంది.

"అబ్బాయి! ఇవే నీ పెళ్లిబట్టలు. పాడుచేసుకుంటే నీ ఖర్మం" అని కూడాచెప్పింది. ఆమె కోటుబొత్తాములు మెరుగు పోకుండగా ఉల్లి పొర కాగితముతో మడచిపెట్టింది. కఫ్సు పెట్టుకొనే చోటునా మోచేతుల దగ్గా, ఇంకాసూటు ఎక్కువ ఎక్కడ నలుగుతుందో ఆ అన్నిచోట్లా దారము దూసి టాకీలు వేసింది. ఆమె ఇంతజాగ్రత్తగా సూటు జాగ్రత్త చెయ్యడం చూస్తూవుంటే అతనికి ఒళ్లు మండింది. చాలా అసహ్యము వేసింది. కాని ఏమిచెయ్యగలడు? చివరకు ఆమె "తస్మాత్ జాగ్రత! జాగ్రత!" లూ, మందలింపులూ అతని మనస్సుకు పట్టినవి. అందమైన తన సూటు విప్పివేసి మడతలు చెడకుండగా గళ్లువేసి దాచివెయ్యడానికి ఒప్పుకున్నాడు. అమ్మ చెప్పినట్టుగా అంతాచేసి ఆఖరున మడతపెట్టిన సూటు చూసుకొని నిస్పృహపొంది వేడిగా నిట్టూర్చినాడు. కాని అతను అస్తమానమూ దాన్ని గురించే తలపోతలు. ఎప్పుడైనా ఆ సూటు శీఘ్రముగా విప్పుకొని టాకాలు తెంపిపారేసి బొత్తాములమీది ఉల్లిపొర కాగితము తీసేసి వేసుకునే మంచిరోజు వస్తుందా అని ఉవ్విళ్లూరుతూ ఉండేవాడు.

ఒకనాటి రాత్రి అలవాటు ప్రకారము అతను సూటునుగురించి కలలు కంటుంటే— కోటుపై బొత్తాముపైన ఉల్లిపొర కాగితం నెమ్మదిగా గల్లి లాగిపారవేసి చూచేటప్పటికి దాని మెరుగు మాసిపోయి నల్లగా ఉన్నట్టు ఒకదృశ్యము కనిపించింది. దానివల్ల అతనెంతో మనోవ్యథల పాలయినాడు కలలోనే.

గాలిలో మేడలు కట్టూంటే కొన్ని రోజులు గడచినవి. ఒకరోజున సూటు వేసుకోవడానికి అనుజ్ఞఇచ్చింది అతనితల్లి. అప్పుడొక బొత్తము మీది కాగితము ఇంతవెనుక లాగివేసి మెరుగు బాగా ఉందో లేదో చూద్దామని మహా ఆత్రము పడ్డాడు. ఆ ఆత్రములో పొర విప్పుదామని భీకరాట్టహాసం చేసినాడు. దర్జాగా నడుస్తూ గుడికి వెళ్ళుతూ ఉన్నంతసేపూ ఈ కోరిక అతన్ని వేధిస్తూనే ఉన్నది. కాని వాళ్ల అమ్మ "దాన్ని మాపుకున్నా పాడుచేసినా నీపు పెట్టకొట్టివేస్తా"నని

భయపెట్టింది. అప్పుడప్పుడు ఆదివారాలు గుడికి, ఆకాశం మేఘచ్ఛన్నము అయివున్నదో లేదో చూచి, రోడ్లమీద దుమ్ము లేకుండా చూచి, బొత్తముల మీద పొరకాగితాలు అల్లాగే వుంచి, ఎక్కువ సూర్య రశ్మితగిలి సూటురంగు వెలిసి పోకుండగా చేతికి ఒక గొడుగిచ్చి "దిక్కులు చూడకుండా దారిలో ఎవ్వరినీ తాకకుండా గుడికి వెళ్లి రారా!" అని అబ్బాయిని పంపేది. అటువంటి రోజుల్లో గుడినుంచి రావడం తడవు. అతను దాన్ని బాగా బ్రష్ పెట్టి దుమ్ము దులిపివేసి మామూలుగా అమ్మ చెప్పినట్లు మడతలు చెడకుండా గళ్లువేసి జాగ్రత్త చేసేవాడు. సూటు తొడుగు కోవడమునకు అమ్మ పెట్టిన ఆజ్ఞలన్నీ కిమ్మనకుండా పాలించేవాడు.

ఒక నాటిరాత్రి నిద్రనుండి చటాలున మేల్కొన్నాడు. గది కిటికీలో నుండి చూస్తూఉంటే చంద్రుడు ప్రకాశమానంగా వెలుగుతున్నాడు. ఆ రేయివెన్నెల లోక మోహనంగావుంది. నీలి నభముమీద మధుమూర్తి నృత్యం చేస్తున్నాడు. లోకం మోహినీ దేవతయి ప్రేమ సూత్రాలు పట్టుకొని తూగుటుయ్యాలలో కూర్చుని తార లంటేటట్లుగా ఊగుతూన్నది. అతను మాంద్యముగా పడకమీద దొర్లుతున్నాడు. ప్రకృతిఎంతో ఆహ్లాద కరముగాఉండి వెన్నెల పండుగ చేస్తూండగానే నిల్లా మాసిపోయిన బట్టతో ఉండడం బాగ లేదను కున్నాడు. లోపల కోటుతొడుగు కుందామనే కోరిక రేకు విరిసింది. కాని అమ్మ చెప్పినమాటలు ఇంతసేపూ అతని తలలో పరిభ్రమిస్తూనే ఉన్నవి. చురుకుగా మంచముమధ్య కూర్చున్నాడు. పిట్టహృదయము దడదడా కొట్టుకుంటూ ఉన్నది. నఖశిఖ పర్యంతమూ పులకలు పరుగెడుతున్నాయి. ఒక అచల నిశ్చయానికి వచ్చాడు, సూటు వేసుకోవాలని- దాని టాకాలు, కుట్లు, బొత్తాములమీది కాగితాలువిప్పి సూటు వేసుకోడానికి నిశ్చితమైంది మనస్సులో. కంచు కాగడావేసి గాలించినా అతని హృదయములో జడుపుగాని అనుమానంగాని కనపడదు. ప్రకృతిదేవి ప్రణయ కోలాహలంలో తానుకూడా పాల్గొంటున్నా

ననే మహాభావంతో నిండిపోయినాడు. ఆ మహాభావమే అతని హృదయ సంధులను కదలించివేసింది. శరీరాంచలాలను కంపింపచేసింది. అతనికి అంతా ఆనందమే! ఆనందమే!! తానుకూడా ఆనందమే!!! ఆనంద రేఖ అయిపోయినాడు.

మంచం మీద నుంచి లేచాడు. కాసేపు కిటికీకి ఎదురుగా నిలుచున్ని వెన్నెల వరదలు వచ్చి పొంగిపోయి, నురగలు చిమ్ముతున్న తోటకేసి చూశాడు. తాను చెయ్యబోతూ ఉన్న గొప్ప చోరీ తలచుకున్ని వణికి పోయినాడు. ఆ ప్రదేశమంతా చిమ్మెటల చిరుసంగీతముతోటీ ప్రకృతి భావ విలీనతలో జీబులుకట్టిన సకల జీవరాసులతోటీ నిండి ఉంది. పిల్లిలా నడిచాడు. తలుపులు చప్పుడు చేయకుండా బార్లాతీసి బట్టలపెట్టె ఉన్నచోటు చేరుకున్నాడు. చీకట్లో పెట్టెమూత తడిమి పైకెత్తి ఒక్కొక్క మడతే తీసి బైటపెడుతూ తన సూటు కోసము వెతికాడు. చివరకు దొరికింది. ఎంతో హస్త విన్యాసముతో సూటు పైకితీసి బొత్తాములమీది ఉల్లిపొరలాగి టాకాలన్నీ పుటుకుపుటుకుమని తెంపేసి ఒక్కసారి దాన్ని — ఆ సూటుని — పైకెత్తి చూచుకొన్నాడు. ఓహో! ఎంతో అందంగా ఉంది. ఎప్పుడో మొట్టమొదట సరిగా వాళ్లమ్మ తొడుక్కొమ్మని యిచ్చినప్పటి దాని లాగే ఉంది. ఒక బొత్తాము మెరుగైనా పోలేదు. ఒక్క పోగైనా రంగు పోయి వెలిసి పోలేదు. సూటు చూచుకొని పట్టలేని ఆనందముతో బాష్పాలు రాల్చాడు. ఆపుకోలేని నవ్వులో పొంగిపోయినాడు. దాన్నితొడుక్కొని చరచరా పిల్లి అడుగులు వేస్తూ మళ్ళీ తనగది కిటికీని చేరుకున్నాడు. ఒకసారి కిటికీలోనుంచి వెన్నెట్లోకి చూస్తూ ఒకనిమిషము నిలుచున్నాడు. ఆ నిముషము లోనూ అతను వెన్నెల్లో ధగధగా మెరిసి పోతున్నాడు. కోటు బొత్తాములు నక్షత్రముల్లా చమక్ చమక్ లాడుతున్నాయి.

కిటికీలోనుంచి బైటికి వెళ్లిపోయి చప్పుడేమీ చెయ్యకుండా నింపాదిగా తోట బాటలోకి దిగినాడు. కాసేపు తనింటి కెదురుగా నిల్చు

న్నాడు. వెన్నెల వెల్లలు వేయడంచేత పట్టపగల్లోలా తెల్లగానేఉంది యిల్లు. ఇంటి కిటికీ తలుపులన్నీ మూతపడి ఉన్నాయి — నిశ్చల సుషుప్తిలో ఉన్న మానవుని నేత్రములమల్లే— కాని తన గది కిటికీ తలుపు మాత్రము ఒక్కటే తీసిఉంది, గోడలమీద నీలి నీడ లగపడుతున్నాయి. ఆ నీడలన్నీ తెల్లబట్ట మీది నల్లని ఊలు "లేసుకుట్టు" ల్లాగున్నాయి ... ... ...

ప్రచండ భానుతేజః పిహితవనము అదొక మోస్తరు దీప్తిని ప్రసారిస్తుంది. కౌముదీ కాంతిస్నపిత కుంజవనము అదొకమోస్తరు శ్యామల దీప్తిని స్రవింప చేస్తున్నది. అది ప్రచండము ఇది ప్రశాంతము ...

వెన్నెలకాంతులు కంచెల్లోనూ కంపల్లోనూ దాగుండి కాంతిగూళ్లను నిర్మించి తోటను వినిర్మలాంబు పూరము చేశాయి. ప్రతి సుమమూ తెల్లని దుకూలమో, రక్త కవచమో ధరించి నట్టున్నది. గంధవాహుడు తన పరిమళములతో గాలిలో ప్రచారము చేస్తున్నాడు. చిమ్మటలు జిమ్మంటూ గీతికా విహరణము చేస్తున్నవి. భరద్వాజములు చెట్లముసురులో నుంచి రాగరేఖలను నింపుతున్నాయి. ఎక్కడ చూచినా వెచ్చని నీలినీడలే! చెట్లాకులూ కుశాగ్రములూ మిల మిల మెరిసే మంచు ముత్యాలతో ప్రకాశిస్తున్నాయి. ఆ రాత్రి అంత మోహనంగా, హాయిగా కాలచక్రంలో ఏరాత్రి ఉన్నట్టేలేదు. ఒక నూత్నచైతన్యము ఒక నవజీవకళ. ఆకాశమే భూమిని సహస్రధా వెన్నెల కౌగిళ్లలో ఇముడ్చుకున్నది. తారా మనోహరుడు శ్వేతాశ్వమును పూన్చి వాహ్యాళి చేస్తునాడు. చుక్కలన్నీ నవ్వుతూ తుళ్లుతూ కేరుకుంటున్నాయి.

ఆ చిన్నవాడు అవిరతానందము పొందుతున్నాడు. ఆ ఆనంద పారవశ్యములో వివశుడై పోయినాడు. అంతేకాని ఏమీ పాడనూ లేదు ఆడనూ లేదు. కొంతసేపు ఏదో భయోత్పాతం కలిగినట్టుగా నిలుచుండి పోయినాడు, తరవాత ఏదో వింతగా సన్నగా పాట నాలాపిస్తూ చేతులు చాచినాడు. తన చుట్టూ కాంతి పుంజమును కౌగలించు

కుందామని— తోటలోని కృత్రిమ పదాలలో నడవలేదు. పూల పాన్పులపై పాదముల నొత్తాడు. హిమానీ శాద్వలాల నీదాడు. సుగంధ లతికల నెడనెడ త్రోశాడు. రజనీ గంధపు పొదల దాటాడు. మోకాలులోతు రెల్లు దుబ్బుల్లోనుంచి చరచరా నడిచాడు. ఆఖరుకు పెద్ద పొదరింటి దగ్గరికి వచ్చాడు. దానిలో నుంచి దూరి నింపాదిగా బైటపడ్డాడు. ఈ మహాయాత్రలో అతని పాదాల్లో ఎన్నో ముళ్లు విరిగినాయి. శరీరమంతా కంటకావృతమైనది. తన సూటుకు ముళ్ళకంపలు తగలడము చేత ఎన్నో పోగులూడి పోయినాయి. దాని నిండా ఎన్ని చీపురుముళ్లు ఉన్నాయో వాటికి పరిమితిలేదు. అతడు ఏమీ లక్ష్యం చెయ్యలేదు. అగమ్య మార్గాలన్నీ దాటాడు. అంతే అతనికి కావాలి.

బంగారు నా సూటు
రంగారు నా సూటు
మురిపెంపు నా సూటు
తొడుక్కున్నా నోయ్?
ఓయ్! ఓయ్!!
హాయ్! హాయ్!!

అను కుంటున్నాడు. పెద్ద పొదరింటి కవతల ఉన్న నీటిగుంట చేరుకున్నాడు. — కాదు, పగలు నీటిగుంటల్లే కనపడే దాన్ని చేరుకున్నాడు. ఆ రాత్రి అది గుంటలా లేదు. వెండి కలశంలోని మంగళ దీపంలాగుంది — ఆ సుధాకరుని మహోదయచ్ఛాయల సోకడంతోనే. కప్పలు బెకబెక లాడ సాగినవి. వెన్నెల తీగెల జిగిబిగి అల్లికలు వింత అందాన్ని సమకూర్చుతున్నాయి. ఈ చిన్నవాడు దానిలోకి కలుపు రొడ్డలు ఒత్తిగించుకొని పరుగెత్తుకు వెళ్లాడు. మోకాటిలోతు నీళ్ళల్లో నడిచాడు. తరువాత నడుము మునిగింది. కుత్తుకబంటి నీళ్ళల్లోకి వెళ్లాడు. రెండు చేతులతోటే నీళ్ళను చేదాడు. నీళ్ళన్నీ కదిలి మిలమిలా మెరసినవి. చిరుతరగలు లేచినవి. ఆతరగలు జలజలా

కరగిపోతూ వచ్చాయి. ఈ చిరుతరగల వలలో చిక్కుకుని తారలు కిచకిచ లాడాయి. చెట్లనీడలు కూడా చెదరిపోయినవి. నీళ్లలోకి లోతందే వరకు దిగాడు. తరువాత ఈదులాడి ఆవలిదరి చేరుకున్నాడు. ఒళ్ళూ బట్టలూ తడిసి ముద్దయి పోయినాయి. వెన్నెట్లో తానొక వెండిరేకులా మెరసి పోతున్నాడు. ఇంకా నడచి పోయినాడు. చెట్లూ పుట్టా దాటి, పచ్చగడ్డి పొలాలు దాటి వెన్నెలబయళ్లు దాటి రోడ్డు చేరాడు. ఊపిరాడని నవ్వులో " ఈ శుభావసరానికి సరిపోయిన దుస్తులు వేసుకో గలిగిగాను. ఈ మోహినీ ప్రకృతికి యథాశక్తిగా నా పూజోపహారం అర్పించ గలిగాను. ఓ! నా కెంతో ఆనందంగా ఉంది" అనుకున్నాడు.

హైరోడ్డు ముక్కుసూటిగా బ్రగీతలా కనపడు తున్నది. తిన్నగా చందమామకు కిందగానున్న కుహరంలోకి పోయింది రోడ్డు. తెల్లగా గోధుమతాచులా మిలమిల లాడుతూ ఉన్నది. ఇరుపక్కల చెట్లల్లో నుంచి భరద్వాజములు మంజుల గానం చేస్తున్నవి. రోడ్డు మీదుగా నడిచాడు. నడుస్తూ నడుస్తూ గెంతులు వేశాడు. గెంతువేస్తూ నడిచే వాడు. వాళ్లమ్మ ప్రేమాంగుళులతో ఓపికగా కుట్టిపెట్టిన సూటు కూడ అతనితో పాటు గెంతింది.

రోడ్డంతా దుమ్ముగా ఉంది. కాని అదంతా అతనికి మెత్తని పిండి ఆరబోసినట్టు కనుపిస్తున్నది. అతను నడుస్తూ ఉండగా బొద్దుగా పెరిగిన సీతాకోక చిలుక అతనిచుట్టూ తిరుగుతూ పాడుతున్నది. మొట్టమొదట దాన్ని ఏమీ లెక్క చెయ్యలేదు. తరువాత చేతులెత్తి దాన్ని పట్టుకో ప్రయత్నిస్తూ దానిచుట్టూ చిందులు తొక్కుతూ నాట్యం చేసినాడు. అది తన తలచుట్టూ గిరగిరా తిరుగుతూంటే "ముద్దొచ్చు చిలకా! మెత్తన్ని చిలకా!, ఆహా! ఎటువంటి రాత్రి!, ఎటువంటి వెన్నెల! చిలకా! నిజం చెప్పవూ! నా బట్టలందంగా ఉన్నాయా? నీ రెక్కలంత అందంగా ఉన్నాయా? పోనీ! ఈ కౌముదీ

పరిధానమంత అందంగానైనా లేవూ?" అని దాన్ని కుర్రవాడిలా అడిగాడు. ఆ పురుగు అతనిచుట్టూ, మరి మరీ దగ్గరగా తలచుట్టూ తిరిగి చటుక్కున తనపట్టు రెక్కలతో అతని అధరాన్ని తాకింది.

మరుసటి దినం ప్రొద్దున చూచేప్పటికి అతను చనిపోయి ఉన్నాడు. మెడ విరిగి పోయింది. రాతిగోడ పక్కన పడిఉన్నాడు. తొడుక్కున్న బట్టలనిండా నెత్తురు మరకలున్నాయి. కాని అతని ముఖవికాసం అద్భుతంగా ఉన్నది. అతనెంత ఆనందంగా చనిపోయి నాడోగదా! అనిపిస్తున్నది. అతనారాత్రి ఈదింది వట్టి మురికి గుంటలోనో, లేక వెండికలశములోని కౌముదీకాంతుల్లోనో తెలుసుకోకుండా. ఆహా! ఎంత ఆనందంగా చనిపోయి నాడో గదా అని ఊరికే అనిపిస్తుంది.

హెచ్. జి. వెల్సు నుండి అనువాదము.

# చుక్కలు! చుక్కలు!!

చుక్కలు! చుక్కలు!!
చక్కని చుక్కలు!

వజ్రపు ముక్కలు
వలపుల రెక్కలు
ప్రేయసి పిలుపులు
గేయసి ఝుళుపులు! ... చుక్కలు ...

అందపు దీవులు
అమృతపు బావులు
శోభ వహములు.
సురభు వనములు! ... చుక్కలు ...

ముత్తైపు సరులూ
ముద్దుల ఝరులూ
తెలుగు వెలుగులూ
వెలుగు తెలుగులూ! ... చుక్కలు ...

తళతళ లాడే
మిలమిల లాడే
కన్నులు! కన్నులు!
అచ్చెర మిన్నులు, అందపు మిన్నుల
విరిసిరి విలసన్నవ మాధురితో ... చుక్కలు ..

ఆరని ఆశలు!
ఆంధ్య రజనిలో
దీప్తులు! దీప్తులు!!
దివి నా కాప్తులు!!! ... చుక్కలు ...

చెలి చికురములో
చెదరిన మల్లెలు
తీరని తేనియ
తీయని వాంఛలు! ... చుక్కలు ...

జృంభిత నవయుగి
కేలలు! జ్వాలలు!
తారుణ్యపు కరు
ణారుణ లీలలు! ... చుక్కలు ...

చుక్కలు! చుక్కలు!!
చుక్కలు!!! చుక్కలు!!!!

కొమర్రాజు వినాయక రావు

# కైలాసవాసి : హరిప్రసాదరావు

బెజవాడ స్టేషన్‌లో పుస్తకశాల వారి ప్రకటన బోర్డులో "ఆంధ్రనట పితామహుని నిర్యాణము" అని పెద్దక్షరములతో ఉన్న కాగితం అప్రయత్నంగా కంటబడే సరికి గుండె ఝల్లుమన్నది! అది చూడడంలో మొదట 'నాటక పితామహుడు' అనుకున్నాను. ఈ రోజుల్లో నాటక పితామహు లెవరొచ్చారని సంశయం తోచి మళ్ళీ చూశాను. నట పితామహుడని స్పష్టమయింది. ఆ క్షణంలోనే హరిప్రసాదరావు గారి పేరు జ్ఞాపకం వచ్చింది. కాళ్లు బరువెక్కి అక్కడే నిలబడి పోయాను.

అదివరకు పదిరోజుల క్రిందట గుంటూరులో పత్రి శ్రీనివాసరావు గారితో మాట్లాడుతూ సందర్భవశాన ప్రసాదరావుగారి వంట్లో ఎలా వుందని అన్నాను. ఈమధ్య నింపాదిగానే ఉందన్నారు ఆయన. మళ్లీ ప్రసాదరావు గారితో కొంత కాలం అప్పుడప్పుడు సుఖంగా గడప వచ్చు ననుకున్నాను. ఇంతలోనే ఈ ఘోరవార్త కంటబడ్డది.

అసలు ప్రసాదరావుగారిని 1904వ సంవత్సరములో మొదటి పర్యాయం చూశాను. ఆవేళ వేణీసంహారం నాటకం. ప్రసాదరావు గారు దుర్యోధన పాత్ర ధరించారు. అందరం ముగ్ధులమయి పోయాం. నాటకమయి రంగులు కడుక్కున్న తరవాత మామూలు బట్టలతో [illegible]దరావు గారు ఇవతలికి వచ్చారు. మా అన్నగారు ఆయన్ని పల[illegible]మో మాట్లాడి అభినందించారు. నేను గౌరవంతో చూస్తూ [illegible]. నాటనుంచీ నేటివరకూ నాకు ప్రసాదరావు గారి విష[illegible]చ్ఛిన్నమైన గౌరవం. తిర్వాత మరకొంత కాలానికి సారంగ[illegible]ం చూశాను. ప్రసాదరావుగారు అప్పటికి నడివయస్సులో ఉన్నారను కుంటాను. సారంగధర పాత్ర ధరిస్తే మైనారిటీ వెళ్లని తరుణుడువలె [illegible] ఆ పద్యాలు చదివేపద్ధతి, ఆ అభినయ కౌశలం, ఇప్పటికీ కళ్ళకు కట్టినట్టున్నది. ఇంకొక సందర్భంలో శాకుంతల

ములో దుష్యంత భూమిక ధరించి పౌరాణిక యుగంలోకి తీసుక పోయారు ప్రేక్షకులని. అనేకులు దుష్యంత పాత్ర ధరించిన వారిని చూచాను. ప్రసాదరావుగారి పద్ధతి ఎవరికీ అలవడలేదు. వివిధ సందర్భములలో వారి నాటక ప్రదర్శనాలు ఎన్నో పర్యాయములు చూచాను.

యడవల్లి సూర్యనారాయణ, దేవరకొండ వెంకట సుబ్బారావు, కపిలవాయి రామనాథశాస్త్రి గార్లు రంగస్థలంమీద పద్యాలు చాలా బాగా అంటారు. ప్రసాదరావుగారు పద్యం పలికించేపద్ధతి నా అభిప్రాయంలో నభూతో నభవిష్యతి. పెద్ద వృత్తంగాని, చిన్న పద్యంగాని ఎత్తుకుని, ముగించే సరికి సంపూర్ణంగా రాగం కూడా ప్రస్తరించి నట్టయిపోయేది. ఇతరులు పద్యం ముగించి నిమిషం వరకైనా రాగం తీస్తూనే ఉంటారు. ఈయన ముగించడం పావునిమిషం కూడా పట్టేదిగాదు. శృంగార కరుణ రసాలను అభివ్యక్తం చెయ్యడంలో అందెవేసిన చేయి. కర్ణాటక రాగాలే కాకుండా హిందుస్తానీ కూడా సమ్మిశ్రణం చేసి నవీనశైలిలో ప్రసాదరావుగారు పాడుతుంటే కర్ణజ్వరం పోయేది. ఆయన ప్రదర్శించిన తరవాత అవివర కర్థంకాని కవివాక్యాలన్నీ మాకు సుబోధకము లయ్యేవి.

ప్రసాదరావు గారు చాలా స్నేహ పాత్రులు. అతిశయం లేనివారు. అందరికీ ఆయన మొకుల గౌరవం. ఆయన చేస్తూవుండేది పెద్ద ఉద్యోగం కాకపోయినా ఉన్నతాధి కారులు కూడా ఆయన్ని చాలా ఆదరించేవారు. ఒక పర్యాయం కోడి రామమూర్తి గారు గుంటూరు వచ్చినపుడు నాటక శాలలో ఉపన్యసిస్తారని ప్రకటించారు. నాటక శాల క్రిక్కిరిసి పోయింది. ఎంతసేపటికీ రామమూర్తి గారు బయటికి రారు. ఎవరోవచ్చి ఉపన్యాసం లేదన్నారు. మాకు తెలియదు, ఉన్నది అని అందరూ గడబిడ చేశారు. కొంత సేపటికి హరిప్రసాదరావుగారు రంగస్థలం మీదికి వచ్చి ఉపన్యాసం ఈ పూట జరగదు అన్నారు. మహాజనమంతా శాంతంగా లేచి వెళ్లిపోయారు.

1918-19 సం॥లో ప్రసాదరావుగారి ఆయిల్ పెయింటింగు చేయించాలను కున్నాము. నా మిత్రులు సుప్రసిద్ధ చిత్రకారులు వఝ్ఝ బాబురావుగారు పెయింటింగు చెయ్యడానికి ఉద్యుక్తులయ్యారు. ప్రసాదరావు గారిని సిట్టింగ్సు యివ్వమని అడిగాము. అంగీకరించారు గాని అనార్యోగం వల్ల అంతరాయాల వల్ల, అది జరగలేదు.

ప్రసాదరావు గారిని బహిరంగ సభలో సన్మానించాలని అనుకొనే ఒళ్ళం. 1934 సం॥లో నాట్యకళా పరిషత్తువారు మద్రాసు నగరంలో వీరిని సన్మానించాను. ఆ సభలో వారినిగురించి నేను మాట్లాడాలనుకుంటుంటే ఎవరో లేచి చప్పని ఉపన్యాసం చేశారు. నా మనస్సుకంత తృప్తిగా లేకపోయింది. అయినను వారి సత్కారానికే సంతోషించాను.

ప్రసాదరావుగారి స్మృతి చిహ్నం గుంటూరులో నెలకొల్పడం చాలా ఉచితం.

నటశేఖరుడైన ప్రసాదరావుగారు మహానటుని సన్నిధానం చేరుగాక.

# సమీక్ష

కాకతీయాంధ్ర రాజయుగ చరిత్ర విమర్శనము:—
[ క్రౌను 64 పుటలు. వెల రు 0—8—0 గ్రంథకర్త: మారేమండ రామారావు గారు. ఎం.ఏ.బి.ఇడి, గుంటూరు ]

కవిత్వమునకును, పరిశోధనకును విమర్శనము మిక్కిలి సహాయకారి యే, కాని సరసత్వమును, సహేతుకత్వమును విషయమును వదలి వ్యక్తుల నపహసించు విమర్శన మపకారము కంటె హేయమైనపకార్యమునే జేయును. ఇటీవల ప్రకటింప బడిన శ్రీ చిలుకూరి వీరభద్రరావు గారి "కాకతీయాంధ్ర యుగ చరిత్రము" ను దానిపై శ్రీ రామారావుగారు ప్రకటించిన యీవిమర్శనమును నిష్పాక్షిక దృష్టి పరిశీలించినచో, మన దేశపు పండితులలో గల వైయక్తిక దౌర్బల్యము గోచరమగు చున్నది.

ఈ విమర్శన మందలి మొదటి భాగము శ్రీ వీరభద్రరావు గారి గ్రంథావతారిక లోని వ్రాతలు కొన్ని తొందరపడి వ్రాసిన వనియు, వారు చేసిన వ్యక్తిదూషణ మనవసర మనియు, నసమంజస మనియు తెలుప గలదు. 'కాకర్త్య గుండ్యన'ను గూర్చియు, కాకతి పురమును గూర్చియు శ్రీ వీరభద్రరావు గారి వ్రాతలు స్పష్టముగ లేవనుట నిజము. ఈ విమర్శనమున జూపబడిన కాల నిర్ణయ దోషములు మిక్కిలి శోచనీయములు. రెండవ ప్రోల, రుద్రదేవులను గూర్చి శ్రీ వీరభద్రరావుగారొనర్చిన నిర్ణయములంత సమంజసములు కావని యీపుస్తకము నందలి VIII, IX, X విభాగములవలన తోచుచున్నది. కాకతి మహాదేవరాజు రాజ్యము చేయలేదను వాదము దుర్బల మయినదని యిందలి XI వ. విభాగమున నిరూపింప బడినది. ముమ్మడమ్మను గూర్చియు, మొదటి బేతరాజును గూర్చియు శ్రీ రామారావు గారు చేసిన విమర్శన మాలోచనీయము. మొత్తము మీద నీ విమర్శనము వలన శ్రీ వీరభద్రరావు గారి గ్రంథము

నందుగల బహు దోషములు సోదాహరణముగ జేర్కొనబడినవి. సామాన్య పాఠకులకు పైగ్రంథము నందలి నిజానిజములను గుర్తించుటకును, పండితులకు కాకతీయ చరిత్రమునందు గల వివిధ సమస్యలను పునర్విమర్శించు కొనుటకును, ఈ చిన్న విమర్శనము సహాకారి కాగలదు.

విజ్ఞానము సంపాదించి యితరుల కందజేయుహక్కు అందరికిని గలదు. వైయక్తికముగను, అవకాశములను బట్టియు పరిశోధకులలో భేదము లుండ వచ్చును. సరసము, సాదరమునగు విమర్శనము వలన లోటుపాటులను సరిజేసికొను టుచితము. అంతియకాని, అన్యోన్యము తిట్టుకొనుటవలన ఆపని నెఱవేఱదు. ఉత్తమ చరిత్రగ్రంథములలో వ్యక్తిదూషణమును ప్రవేశపెట్టుట మిక్కిలి శోచనీయము. ఆంధ్రదేశమున చరిత్ర పరిశోధకుల సంఖ్యయే తక్కువ. ఉన్న కొలదిమందియు నిట్లు పరస్పర వైషమ్యములతో కాలము వృథా చేసినచో దేశచరిత్రము వెనుకబడును. ఒకరి నింకొకరు "త్రోసిరాజనుట" యు "అణగ ద్రొక్కుట" యు భ్రమలే. తమతమ సేవల ననుసరించి ప్రతివారికిని లోకము గౌరవము చూపియే తీరును. షుమారెనిమిది యేండ్లనుండియు చరిత్ర పరిశోధనమున కృషి చేయుచున్న రామారావుగారిని "శిక్షణ శీలములు లేని యువకుడు" అని వీరభద్రరావుగారు దూషించుటయు వీరిని వారు "నాటుపండితులని" యనుటయు తగవు. ఇకమీదనైనను ఆంధ్ర పరిశోధక రంగమునందు వ్యక్తి దూషణ తలయెత్తకుండుగాక. పరిశోధకు లన్యోన్య సహకారమున దేశమునకు సేవ యొనర్తురు గాక.

రా. సు.

**Libraries in ancient and medieval India. Price As 8.**

గ్రంథకర్త:- మారేమండ రామారావుగారు ఎం.ఏ. బి.ఇడి.

గ్రంథాలయములు దేశసేవ కత్యంతోపయోగములు. పుస్తకము విరివిగా దొరకనిరోజులలో విద్యావ్యాప్తి ఎట్లుండెడిదో, గ్రంథాలయము

లెట్లుండెడివో, వ్రాతపరికరము లెట్టివో మొదలగు విషయము ల నేక ములు తెలిసికొనుట సామాన్యజనుల కనేకులకు కోరిక గలుగు చుం డును. భారతదేశమున గ్రంథాలయములు చాల ప్రాచీనకాలము లం దు కూడా ఉండెడివని తెలియు చున్నది. గ్రంథాల యోద్యమమును గూర్చి చారిత్ర దృష్టితో పరిశీలించి ప్రాచీన మధ్యమ యుగములం దలి గ్రంథాలయముల స్థితిని తెలుపుచు భారతీయ నాగరికతను గూర్చిన ఒక ముఖ్యాంశమును గూర్చి విపులముగ గ్రంథకర్త చర్చిం పగలిగెను.

మొదటి అధ్యాయమున గ్రంథాలయము లను గూర్చిన కార్లయిలు పండితుని వాక్యముతో ప్రారంభించి అందు లిపియొక్క ఉత్పత్తినిగూ ర్చియు వ్రాత పరికరములను గూర్చియు గ్రంథకర్త చర్చించెను. ఆ కాలపు లిపికి భారతదేశమే జన్మస్థానమని వీరివాదన. ఈ విషయ మునుగూర్చి ఇప్పటికిని వివిధాభిప్రాయములు కలవు. రెండవ అధ్యా యమునందు గ్రంథా లయముల ఉత్పత్తి పరిణామముల గూర్చియు, మూడవ అధ్యాయములో గ్రంథాలయము లుండు తావులను గూ ర్చియు తెలిపిరి. ఈగ్రంథమువలన భారతదేశపు విద్యా విషయములగు అనేకములగు నూతన విషయములు తెలియుచున్నవి. సామాన్య పాఠకులకు స్వదేశ గౌరవమునుగూర్చి తెలిసి కొనుటకును చరిత్ర పరిశోధకులకు గ్రంథాలయములను గూర్చిన విశేషాంశములను గూర్చి చర్చించుటకు ఈ చిన్న గ్రంథము పలు విధముల తోడ్పడు చున్నది.

రా. సు

గ్రంథాలయ సర్వస్వము:— సంపాదకులు: గాడిచర్ల హరిసర్వోత్తమ రావు ఎం.ఏ, మారేపల్లి రామచంద్రశాస్త్రి, అయ్యంకి వేంకటరమణ య్య. బెజవాడ. సాలుచందా రు 3లు.

ఈ పత్రిక 1936 నవంబరు సంచిక విమర్శనార్థము మాకార్యాలయాం చేరింది. ఈ పత్రిక పెక్కు సంవత్సరములనుండి గ్రంథాలయములకు చేసినసేవ అపారము. ప్రతి గ్రంథాలయము తెప్పించదగినది. ఈసంచి

కల్లో గాడిచెర్ల హరిసర్వోత్తమరావు గారు వ్రాసిన 'బ్రహ్మచర్యము-గార్హస్థ్యము నశింప నున్నవా?' అనే వ్యాసము ఆలోచనార్హము. ఇంకా లోకవార్తలు, కథలు, గ్రంథాలయాల వృత్తాంతాలు అన్నీ ప్రకటిస్తున్నారు.

ప్రకృతి:—(సహజవైద్య మాసపత్రిక.) సంపాదకుడు: డాక్టరు కే. వెంకట్రామయ్య. బెజవాడ. సాలుచందా రు 3-0-0లు.

ఈ పత్రిక 1936 నవంబరు సంచిక మా కార్యాలయ మలంకరించినది. మన తెలుగు భాషలో ప్రత్యేక విషయాలను గురించి ప్రకటించే పత్రికలు చాలా తక్కువ. ఒక వేళ సాహసించి యెవరయినా నడిపినా ఏ ధనాఢ్యుల భూరివిరాళాల చేతనో జీవించవలసిందే గాని జన సామాన్యము యొక్క ఆదరణ పొందేది సున్న. అట్టి స్థితిలో తలకొప్పి వస్తే డాక్టర్ల బిల్లు చెల్లించక తప్పని ఈ నవనాగరికపు రోజుల్లో నాటువైద్యులకు, ఇంగ్లీషు డాక్టర్లకు యెదురుతిరిగి యీ మహాప్రకృతియే, గాలి- యెండ- నీరు ఇవే మానవ జీవితమునకు ముఖ్యములగు మందులని నిర్భయముగా పదునెనిమిది సంవత్సరములనుంచీ చాటుతూ ఈ పత్రిక నిలిచి ఉందంటే మాకు చాలా ఆశ్చర్యం వేసింది.

ఈ సంచికలో: 'పైపూత' అనే వ్యాసంలో కురుపులు మొదలైన చర్మవ్యాధులకు మందులు పైనరాయడంవల్ల కలిగేనష్టము చక్కగా వివరించారు. "ఎప్పుడు మాలిన్యములు ఒక గంధ్రము వెంటగాని, అనేక రంధ్రముల వెంట గాని వెడలుచున్నవో అప్పుడు ఆ ప్రదేశమున నయమగుటకు యేమీ చికిత్స చేయవద్దు" అనేమాట గమనార్హము. 'కశేరుకా చికిత్స'లో ఎముకలు తొలగినప్పుడు చేయవలసిన విధులు చక్కగా నిరూపించారు. సంపాదకులు వ్రాసిన 'బిడ్డకు పాలెన్ని తూరులీయవలెను?' అనే వ్యాసము ఈసంచిక కంతా మణివంటిది. ప్రతి తల్లీ చదివి తీరవలసిందే. ఇంకా యితర వ్యాసములు చాలా ఉన్నవి. ప్రతియింటా ఉండదగిన పత్రిక.

సరస్వతీ బుక్కు డిపో : బెజవాడ



ఆంధ్ర దేశమునందు ప్రదర్శింపబడుచున్న నాటకములు, నవలలు, వైద్య గ్రంథముల జ్యోతిష గ్రంథములు, వేదాంత గ్రంథముల నారాయణ దాసు - బాలాజీ దాసు రచించి హరికథలు అవి ఇవి యననేల? ఇంకా మీ పుస్తకము కావలసినను మావద్ద లభించు

ధరలు సరసము

కోరినవారికి మా కంపెనీ 120 పేజీలుగల కేటలాగు ఉచితము

కురుకూరి సుబ్బారావు

సరస్వతీ బుక్కు డిపో : : బెజవాడ



ప్రకటన వీణలో చూచామని చెప్పండి